శ్రీమద్భగవద్గీత
(పంచమ ముద్రణము)
వ్యాఖ్యాత:
శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావు పంతులు
వెల రు. 4-0-0. పోస్టేజి రు. 0-9-0.
ఆంధ్ర గ్రంథమాల,
6,7, తంబుశెట్టివీధి, మద్రాస్.

# ఆంధ్రపత్రిక

317588

ఆరోగ్యమందిరము
సర్కసు మైదానము, గవర్నరుపేట, బెజవాడ.
ఇచ్చట రోగులు నివసించుటకు చక్కని వసతిగలదు. శ్రీ క్షేమగ్రస్త డాక్టరు ఆచంట లక్ష్మీపతి, బి. ఎ. ఎం. బి. అండ్ సి. యం గారు మద్రాసునుండి వచ్చి ఈనెల 26-వ తేది మొదలు నెలాఖరు వరకు ఇచ్చట రోగులను పరీక్షించి సలహా యిచ్చెదరు.
బెజవాడ, 20-11-49. | మేనేజరు, ఆరోగ్యమందిరము.

The Andhra Patrika, Madras. } Regd. No. M. 1118 Vol. 36 No. 229 TUESDAY 22nd NOVEMBER 1949 వెల ఒకఅణా } Founder: K.NageswaraRao

# "నేటి ప్రపంచ సమస్యలకు యుద్ధం పరిష్కారమార్గం కానే కాదు"

## శాంతియుత పద్ధతులే శరణ్యమని ప్రధాని నెహ్రూ ఉద్బోధ

### "యుద్ధ ప్రసక్తి శుద్ధ అవివేకం"

### మధ్యేమార్గానుసరణలో భారతదేశ విధానం అసిధారావ్రతమని హెచ్చరిక

న్యూఢిల్లీ, నవంబరు 20: "ప్రపంచాన్ని అనేక సమస్యలు ఎదుర్కొంటున్నాయి గాని, వాటిని పరిష్కరించేమార్గం యుద్ధం ఎన్నటికి కాజాలదు," అని భారతప్రధాని పండిట్ నెహ్రూ నేడు ఉద్ఘాటించారు.

పండిట్ నెహ్రూ అమెరికా యాత్రనుండి తిరిగివచ్చిన అనంతరం ఢిల్లీ కాంగ్రెస్ కమిటీ నగరప్రజల తరఫున ఆయనకు స్వాగతం ఇవ్వడానికి ఒక బహిరంగసభను ఏర్పాటుచేసిరి. ఆ సభలో పండిట్ నెహ్రూ ఈ ఉపన్యాసాన్ని ఇచ్చారు.

ఈ ఉపన్యాసంలో పండిట్ నెహ్రూ ప్రపంచసమస్యలను పరిష్కరించే మార్గాన్ని సూచిస్తూ, వాటిని శాంతియుతమైన పద్ధతుల ద్వారానే పరిష్కరించుకోవాలన్నారు.

"ఈ సూత్రాన్ని గనుక ప్రపంచ రాజ్యాలవారు గుర్తిస్తే ప్రజల మనస్సులను వేధిస్తున్న యుద్ధవిషయకమైన బాధ అంతా తొలగిపోగలదు." అన్నారు.

"ఇండియా, పాకిస్థాన్‌ల మధ్యనుగాని, ఇంకా ఇతర రాజ్యాల మధ్యనుగాని ప్రవర్తిల్లుతూ వున్న అభిప్రాయభేదాలను ఈ విధంగా పరిష్కరించుకోడానికి అప్పుడు సుసాధ్యమౌతుంది!" అని నెహ్రూ ఉద్ఘాటించారు.

ఈ సందర్భంలో పండిట్ నెహ్రూ అనేక విషయాలనుగూర్చి తనఅభిప్రాయాలను వెల్లడిచేశారు. అగ్రరాజ్యాలపట్ల ఇండియా వైఖరి, భారత ఆహారపరిస్థితి, ఇండియా పాకిస్థాన్ సంబంధాలు, చైనా సమస్య, మొదలైనవి ముఖ్యమైనవి.

ప్రపంచంలో ఇతర రాజ్యాలపట్ల, ముఖ్యంగా అగ్రరాజ్యాలపట్ల ఇండియా వైఖరి ఏమిటో వివరిస్తూ ఇండియా ఇటూ అటూ చిక్కుపడిపోకుండా మధ్యేమార్గాన్ని అనుసరిస్తుంది. ఒకళ్ళనుచూచి భయపడి వారికి పాదాక్రాంతం కావడం మన లక్షణం కాదు. అట్లా అన్ని ఒకళ్ళ మెరమెచ్చుల కోసం ప్రయత్నించడం గూడా మన విధానం కాదు. అజేవిధంగా ఒకళ్ళమీదదురాక్రమణ పద్ధతులను అమలు జరపడంగాని, విజిగీషతో ప్రవర్తించడం గాని మనకు దూరమైన విషయాలు. ఇది అంతా తేలికయైన విషయంగా మీరు భావిస్తే పొరపడినవాళ్ళవు తున్నారు. ఇది అసిధారా వ్రతచర్య వంటిది. అని పండిట్ నెహ్రూ అన్నారు.

ఇప్పుడు చాలామంది యుద్ధాన్ని గురించి ప్రసంగిస్తున్నారు. అంతకన్నా

(2-వ పేజి చూడుడు)

## పెనామాలో రక్త రహిత విప్లవం

### అధ్యక్షుని పదభ్రష్టత

### పోలీసు తిరుగుబాటు ఫలితం

పెనామానగరం, నవంబరు 20: పెనామాలో పోలీసులు తిరుగుబాటుచేసి డేనియల్ చానిస్‌ను అధ్యక్షపదవినుండి తొలగించి, ఉపాధ్యక్షుడుగా ఉంటున్న రాబర్టు అరియస్‌ను అధ్యక్షపీఠా న్నెక్కించారు.

చానిస్ అధ్యక్షపీఠ మెక్కి, నాల్గు నెలలైనా కాకముందే యీ చ్యుతి సంభవించింది.

ఆకస్మికంగా, విదేశీయులకు క్షోభం కల్పించుకోవడం మూలంగా నగరంలో యేవిధమైన రక్తపాతం సంభవించలేదు.

సుప్రీం కోర్టువారు, అధ్యక్షుడుగా అరియస్ యీ ఉదయం పదవీప్రమాణం స్వీకరింపచేశారు. తిరుగుబాటుచేసిన పోలీసులు యీయనఅధికారాన్ని గుర్తించారు.

తిరుగుబాటు లేవదీసిన పోలీసుఉద్యోగులు గతరాత్రి, పెనామానగరాన్ని ముట్టడించి, స్వాధీనం చేసుకున్నారని, అనేకమంది ప్రభుత్వోద్యోగులని అరెస్టుచేశారని, న్యూయార్కుచేరిన వార్తలనుబట్టి తెలుస్తున్నది.

ఈ తిరుగుబాటుకు కారకుడు అధ్యక్షుడు డా॥ చానిస్ యేనని, ఆయన గతరాత్రి ప్రధాన పోలీసుఉద్యోగిని బర్తరఫ్ చేయడంవల్లనే యిది సంభవించిందని తెలుస్తున్నది.

### నవభారత జాతీయ గీతం

### కామత్‌గారి తీర్మానం: రాజెన్‌బాబు హామీ

న్యూఢిల్లీ, నవంబరు 21: హెచ్. వి. కామత్ ఈసారి భారత రాజ్యాంగ పరిషత్తులో జాతీయ గీతాన్నిగురించి ఆలోచించడానికని ఒక తీర్మానం ప్రవేశపెట్టారు. డా॥ రాజేంద్రప్రసాద్ ఈ సారి రాజ్యాంగపరిషత్తులో మాట్లాడుతూ, తామా తీర్మానం పారశ్య సంఘానికి పంపిస్తున్నామని అన్నారు.

## 1951 లోగా ఇండియాకు ఆహారసమృద్ధిచేకూరుతుంది

### కమిషనర్ ఆర్. కే. పాటిల్ విశ్వాసం

నాగపూరు, నవంబరు 20: నేడు ఇక్కడ పత్రికా విలేఖరులతో ప్రసంగిస్తూ ఆహారోత్పత్తి కమిషనరు ఆర్. కె. పాటిల్, 1951 ఆఖరులోగా ఇండియాకు ఆహారసమృద్ధి చేకూరగలదనీ, ఎరువులు దిగుమతి చేసుకొనడానికి డబ్బు లేక పోవడంగాని, గొట్టపు బావుల పరికరాలు చాలక పోవడంగాని, పత్తిజనుముల ఉత్పత్తి అధికం కావలసి ఉండడంగాని ఆహారసమృద్ధి సాధించడానికి అంతరాయం కావనీ అన్నారు.

ఆహారధాన్యాల ధరలు తగ్గినమాత్రం చేత అధికాహారోత్పత్తి ఉద్యమం పని కాదు నవసరంలేదనీ, ఎందుచేతనంటే ఆహారపదార్థాల ధరలతో బాటుబట్ట, ఇనుము, ఉక్కు మొదలైన అవసరపదార్థాల ధరలుకూడా తగ్గించడానికి ప్రయత్నం జరుగుతున్నదనీ ఆయన తెలిపారు.

అయితే, ఆహారసమృద్ధిలక్ష్యమైన కారణంగా ఆహారధాన్యాల దిగుమతులు నిలిపివేసినట్లయితే ధాన్యంధరలు ఉండదగిన దానికన్నా ఎక్కువగా ఉంటాయనీ, ఆహారధాన్యాలు దిగుమతులు జరిగే అనకాలం ఉంచేపక్షాన ధరలు మరి తగ్గిపోయే ప్రమాదం ఉంటుందనీ, ఈప్రమాదం జరక్కుండా చూస్తామనీ ఆయన అన్నారు.

అన్ని రాష్ట్రాలలోనూ అధికోత్పత్తి కార్యక్రమం సక్రమంగా అమలు జరుగుతున్నదనీ, ఆ కార్యక్రమంలో చెప్పుకోదగిన మార్పులు చేయవలసిన అవసరం లేదనీ, ఈనెల 28, 29, 30 తేదీలలో న్యూఢిల్లీలో రాష్ట్ర ప్రభుత్వాలలోని ఆహార డైరక్టర్ల సమావేశమై ఆహారోత్పత్తిలో కలిగిన అభివృద్ధిని నిర్ణయిస్తారనీ ఆర్. కే. పాటిల్ చెప్పారు.

ఆయన నేడు నాగపూరునుండి న్యూఢిల్లీకి బయలు దేరారు.

### అధికాహారోత్పత్తి

### వివిధరాష్ట్ర వ్యవసాయ శాఖాధికారుల సభ

న్యూఢిల్లీ, నవంబరు 20: వివిధ రాష్ట్రముల, సంస్థానముల వ్యవసాయ శాఖాధికారుల సభ యిచ్చట నవంబరు 28 తేదీన సమావేశమై మూడు రోజులు జరుగును. 1949-52, సంవత్సరముల మధ్య ఆహారోత్పత్తిని అధికముచేయు విషయమై సభవారు విచారింతురు.

## భారత భూభాగం పైతమ పోలీసుల దాడివార్త శుద్ధ అబద్ధమట

### ఇండియా ప్రభుత్వ అధిక్షేపణకు పాకిస్థాన్ ప్రభుత్వ సమాధానం

కరాచి, నవంబరు 19: తూర్పు పంజాబ్ రాష్ట్రంలో గుర్దాస్‌పూర్ జిల్లాలో భారతయూనియన్ భూభాగంపై సాయుధ పాకిస్థానీ పోలీసులు హానులు దాడిచేసినందుకు భారతప్రభుత్వం అధిక్షేపణ తెలియజేయగా, అందుకు పాకిస్థాన్ప్రభుత్వం సమాధానం పంపుతూ, యీ దాడివార్త కేవలం అసత్య కల్పన అని ప్రకటించింది. పాకిస్థాన్ పోలీసులు భారత యూనియన్ సరిహద్దును దాటివెళ్ళలేదని గుర్దాస్‌పూర్ జిల్లాలో పాకిస్థాన్ ప్రాంతంలో 49 సెప్టెంబర్ 1 వ తేదీన పాకిస్థాన్ పోలీసులు లేరు సరిహద్దు కాపలా స్థావరాలను పునర్నిర్మాణం చేసుకొన్నారని, అంతకుమించి వారేమీ చేయలేదని పాకిస్థాన్ ప్రభుత్వం తెలిపింది. సరిహద్దు కాపలా స్థావరాల పునర్నిర్మాణానికి పూనుకొనే ముందు వారు, భారతయూనియన్ పోలీసులకు తెలియజేశారుట.

పాకిస్థానీ పోలీసులు, భారత యూనియన్ గ్రామాలను ఆక్రమించుకొన్నారని, సేనా భారతసైన్యాలపై కాల్పులు ప్రారంభించారని గల వార్తలు శుద్ధ అబద్ధములని పాకిస్థాన్ ప్రభుత్వం తెలిపింది.

## ప్రపంచ ధాన్యాగారం

### అదనపు ధాన్యక్రయ విక్రయానికి ప్రత్యేకసంస్థాపనా పరిశీలన

### అంతర్జాతీయ ఆహార వ్యవసాయ సంఘంలో చర్చకు వచ్చే అంశాలు

వాషింగ్టన్, నవంబరు 19: మిగులు దేశాలవద్ద ధాన్యంలోని తరుగు దేశాలకు అవసరాన్నిబట్టి విక్రయించ గలందులకై "ప్రపంచ ఆహారధాన్య సరఫరా కేంద్రం" ఒకటి స్థాపించవలెనని ఆహార వ్యవసాయ సంస్థ ఒక ప్రతిపాదనచేసింది. ఈ ప్రతిపాదన నవంబరు 21 వ ఇక్కడ ప్రారంభం కానున్న ఆహార వ్యవసాయసంస్థ 58 దేశాల ప్రతినిధుల సమావేశంలో చర్చకు రాగలదు.

మిగులు దేశాలలో నిలవలు అతిగా పెరిగిపోకుండా చూడడం తరుగుదేశాలలో ఉత్పత్తి అభివృద్ధిచేయడం ఇవి ప్రపంచ ఆహారనిపుణులు దృష్టిలో ఉంచుకోనవలసిన ప్రధాన లక్ష్యములు. మొదటిలక్ష్యాన్ని నిర్వహించడానికే "ప్రపంచ ఆహార సరఫరా కేంద్ర" పథకం వేయబడింది. ఆహార వ్యవసాయసంస్థ డైరెక్టరు జనరలు అయిన ఎన్. ఇ. డాడ్ అధ్వర్యమున కొందరు ఆహారనిపుణులు సమావేశమై ఈ పథకమును తయారుచేసిరి. 100 కోట్ల డాలర్ల పెట్టుబడిలో ఆహార వ్యవసాయసంస్థ ఆధ్వర్యంక్రింద ఈ సరఫరా కేంద్రమును నెలకొల్పవలెననీ, మిగులుదేశాలవద్దధాన్యం నిలవలుకొని తరుగుదేశాలకు అవసరాన్నిబట్టి వాటిని సరఫరా చేస్తుఉండడం దీని ప్రయోజనంఅనీ, పథకనిర్మాతలు చెబుతున్నారు. ధాన్యానికి డబ్బు స్వంత కరెన్సీలో చెల్లించదలచుకొన్న దేశాలు తక్కువలమందు మార్కెటులో చెల్లుబడి అవుతున్న ధరలు పెట్టవలసి ఉంటుంది; విక్రయం చేస్తున్న దేశానికి సమ్మతమైన కరెన్సీలో డబ్బు చెల్లించే యెడల, ధరలో కొంత రాయితీ ఇవ్వబడుతుంది. ఇతరేతరంగా వివిధ దేశాలమధ్య జరుగుతున్న వాణిజ్యవ్యాపారమంతకు ఈ అంతర్జాతీయ సరఫరా కేంద్రం అడ్డురాకూడదు. అంతర్జాతీయ సరఫరా కేంద్రం ద్వారా జరిగే వ్యాపారం సాధారణ వ్యాపార సంస్థలద్వారా జరిగే వ్యాపారానికి ప్రతిబంధకం కాకుండా దానికి మీదు మిక్కిలిగా ఉండాలి. ఈ పథకం అమలు జరిగితే ప్రైవేటువ్యాపారం దెబ్బ తినవచ్చుననీ, ఆహారధాన్యాల ధరలు తమ ఇష్టానుసారంగా గాక తరుగు దేశాల ఇష్టానిష్టములమీద ఆధారపడతవని అమెరికా భయపడుతున్నట్లు తెలుస్తున్నది.

పథకాన్ని స్పష్టీకరించ వలసిందని కోరుతూ అమెరికా ఉద్యోగులు ఆహార వ్యవసాయ సంస్థ కార్యాలయానికి కొన్ని ప్రశ్నలు పంపిరి. బ్రిటిష్ ప్రతినిధులు కూడా అమెరికన్ ప్రతినిధులవలెనే ఇటువంటి అంతర్జాతీయ ఏర్పాటులకన్న ప్రైవేటు ఏర్పాట్లే నయమని అనుకుంటున్నారని తెలుస్తున్నది. వెనుకబడిన దేశాలకు సాంకేతిక సహాయం చేయడానికి ఐక్యరాజ్యసమితి వేసిన కార్యక్రమంలో ఆహార వ్యవసాయసంస్థ వహించవలసిన పాత్ర ఏమిటి అన్ని విషయము కూడా సమావేశంలో చర్చకు వస్తుంది. తరుగు దేశాలలో అధికాహారోత్పత్తికార్యక్రమాలకు తోడ్పడడానికి వ్యవసాయసంస్థ ప్రయత్నించగలదు. అంతర్జాతీయ పెట్టుబడి అవకాశాలను గురించి ఆహార వ్యవసాయసంస్థ కార్యాలయం తయారుచేసిన ఒక నివేదికకూడా సమావేశంలో చర్చకు వస్తుంది. సంస్థ సభ్యత్వానికై ఇండొనీషియా, ఇస్రేల్, కొరియా, స్పెయిన్ ఈ 4 దేశాలు పెట్టుకున్న దరఖాస్తులను పరిశీలించడం అవుతుంది.

సంస్థ శాశ్వతకార్యాలయం ఎక్కడనెలకొల్పాలి అన్న విషయంకూడా ఈ సమావేశంలోనే నిర్ణయించబడుతుంది.


నారిస్ యి. డాడ్

### "చచ్చి" బ్రతికిన పసిపాప!

మదరాసు, నవంబర్ 21: 8 నెలల ఆడపిల్ల చనిపోగా కృష్ణాంపేట స్మశానానికి నిన్న సాయంకాలం 5 గం.లకు బంధువులు తీసుకపోయిరి. అచట గోయితీసి పాతిపెట్టుటకు దించేసరికి బిడ్డ కనురెప్పలు కదిలినవి. అంతట పైకితీసి గుండె చూచుసరికి కొట్టుకొనుచున్నట్లు తెలిసెను. పిదప పసిపిల్ల కాళ్లూ చేతులు గూడ కదిలించసాగినది. ఆశ్చర్యపోయి, బంధువులా బిడ్డను దగ్గరలోనే బిసెంటు రోడ్డులోనున్న ఒక డాక్టరుఇంటికి తీసుకపోయిరి. కొద్ది చికిత్స తో పూర్తిగ ప్రాణం వచ్చిన ఆ బిడ్డను చూచుటకు అనేకులు డాక్టరింటికి రాసాగిరి.

## అధికోత్పత్తి సాధనలో ప్రభుత్వానికి డక్కన్ పారిశ్రామికుల సహకారం

### సర్దార్ పటేల్ ప్రకటనపట్ల హర్షం

పూనా నవంబరు 20:— డక్కన్ పారిశ్రామికులు సంపూర్ణముగా తోడ్పడెదరని, దేశమును ప్రస్తుత విషమ ఆర్థిక స్థితి నుండి తప్పించుటలో డక్కన్ పారిశ్రామికులు సముచితమగు పాత్ర వహించెదరని నేడు ప్రభుత్వము వారికి, కార్మికులకు కర్షకులకు హామీ ఒసంగబడినది.

డక్కన్ పారిశ్రామికులు యిచ్చటికి 80 మైళ్ళ దూరమున నున్న భోర్‌లో మూడు రోజులు సభ చేసి యిట్టి వాగ్దానమొసంగిరి.

ప్రస్తుత ఆర్థిక విషమస్థితిని దాటుటకు ప్రజలలో అన్నివర్గముల వారును తోడ్పడవలెనని సర్దార్ పటేల్ గావించినవిజ్ఞప్తిని సభవారు సంపూర్ణముగా ఆమోదించిరి. ముఖ్యముగా దేశసంపదకు దేశక్షేమ లాభములకై ఉపయోగించుకొనుటకు గల ఆటంకములన్నిటిని తొలగించుట ప్రభుత్వ విధియై యుండునని పటేలు గావించిన ప్రకటనకు డక్కన్ పారిశ్రామికులు హర్షం వెలిబుచ్చిరి. ఐనప్పటికి పారిశ్రామికుల నుండి ప్రభుత్వము వారేమి ఆశించుచున్నారు. ప్రభుత్వమువారు స్పష్టముగా ప్రకటింపవలెనని డక్కన్ ఉత్పత్తిదారుల సంఘాధ్యక్షుడు శ్రీ కిర్లోస్కరుగారు సభపక్షమున ప్రకటనచేయుచు చెప్పిరి. వివిధ తరగతులవారి మధ్య సామరస్యము లేకపోవుటవల్ల ఉత్పత్తికి ఆటంకము కలుగునని ఆయన చెప్పుచు ఈ తరగతులమధ్య న్యాయ, నైతిక సంబంధములను ప్రభుత్వమువారు నిర్వచింపవలెననుచున్నారు.

ఈ సభకు డక్కను నందలి వివిధపరిశ్రమల ప్రతినిధులు 100 మందివచ్చిరి. సభాధ్యక్షుడు శ్రీ కిర్లోస్కరుగారు అధ్యక్షోపన్యాస మొసగుచు ఈ ప్రాంత పారిశ్రామికుల కష్టములను వివరించిరి. ఈ కష్టములను ప్రభుత్వమువారు తొలగించవలెననిరి. పారిశ్రామికులు లాభములకై గాక దేశక్షేమమునకై కృషి చేయవలెననిరి.

### కాశ్మీర్ సమస్య

### అజాద్ కాశ్మీర్ నాయకుని ఆర్భాటం

కెయిరో, నవంబరు 20: ఆజాద్ కాశ్మీర్ ప్రభుత్వం అధ్యక్షుడు సర్దార్ మహమ్మద్ ఇబ్రహీంఖాన్ మాట్లాడుతూ కాశ్మీర్ కమిషన్ చేసిన ప్రయత్నాలన్నింటిని నెహ్రూ నాశనం చేశాడని అన్నారు.

స్వయం నిర్ణయాధికారం కోసం కాశ్మీర్‌లో జరుగుతున్న పోరాటాన్ని, బలపరచవలసిందని ఈజిప్టు యనుల కోరుతు ఈజిప్టుకు సూడాన్ ఎటువంటిదో, పాకిస్థాన్‌కు కాశ్మీరు అటువంటిదని ఆయన అన్నారు.

## ఓపికలో ఆయనకు ఆయనేసాటి!

### వివిధశాస్త్రాలలో 14 సార్లు ఎం. ఏ. డిగ్రీ తీసుకొన్న కాశీ పండితుడు

కాశీ, నవంబరు 20: కాశీ విశ్వవిద్యాలయంలో సహోపన్యాసకులుగా ఉన్న పండిత రామకుమార్ దాచే ఈసారి 14 వ విషయంలో ఎం. ఏ. డిగ్రీ తీసుకున్నారు. ఇప్పటికి ఇతడు 13 సార్లు ఎం. ఏ. డిగ్రీ తీసుకున్నారట. ఈవిధంగా ఇన్ని విషయాలలో ఎం ఏ. పరీక్షలో ఉత్తీర్ణులయినవారు ఈయన ఒక్కరేనట.

ఈయన ప్రస్తుతం కాశీ విద్యాపీఠ సనాతన కళాశాలలో గణితము, విద్యాచరిత్ర బోధిస్తున్నారు. ఇంతకు పూర్వము ఈయన 13 విషయాలలో అంటే ఇంగ్లీషు, వేదాంతము, సంస్కృతము, గణితము, చరిత్ర, రాజకీయాలు మొదలైనవాటిలో ఎం. ఏ. డిగ్రీ తీసుకున్నారు: ఇవిగాక ఈయన ఎల్. ఎల్. బి, బి. టి. పరీక్షలలో కూడా ఉత్తీర్ణు లయినారు. వైద్య పరీక్షలో కూడా ఉత్తీర్ణులైనారు.

ప్రస్తుతం ఈయన 14 వ సారి భారత వేదాంతంలోను, మతంలోను ఎం. ఏ. ప్యాసయినారు.

## శాంతి ఒడంబడికకు జపాన్ షరతులు

టోక్యో, నవంబరు 21: జపాను శాంతి ఒడంబడికలో ఈ క్రిందిషరతు లుండాలని జపాను నాయకులు కోరుతున్నారు:

జపాను అంతరంగిక భద్రతను కాపాడడానికి మాత్రమే అల్పాస్త్రాలతో కూడిన కొద్దిపాటి సేన, లక్షమంది సైనికులతో కూడినది ఏర్పడాలి.

జపానుకు జాతీయ స్వాతంత్ర్యమూ, ప్రజాస్వామిక స్వాతంత్ర్యమూ ఇవ్వబడాలి.

40 లక్షల టన్నులకు మించని వాణిజ్య నౌకలు నిర్మించడానికి అనుమతి ఇవ్వాలి. విమానయానం తిరిగి నెలకొనాలి. యుద్ధ సంబంధంలేని పరిశ్రమలమీదా, వ్యాపారంమీదా కృత్రిమమైన నిర్బంధాలన్నీ తొలగాలి. ప్రస్తుతం 40 లక్షల సేకరణల మాత్రమే ఉపయోగించడానికి జపాను అనుమతించబడున్నది. దీనిని రెట్టింపు చేయాలి. ర్యూక్యూ, బోనిన్ దీవులు జపానుకు తిరిగి ఇవ్వాలి. కాని కొంతకాలం పాటు మిత్రరాజ్యాలు పీటిని యుద్ధస్థావరాలుగా వినియోగించవచ్చు. సాధ్యమైనంత త్వరలో జపాను ఐక్యరాజ్యసమితిలో చేరడానికి అనుమతి ఇవ్వాలి.

కొందరు దూరదృష్టిగల జపాను రాజకీయవేత్తలు ప్రస్తుతం సంధి ఒడంబడిక జరగడానికి సుముఖులుగా లేరు. కారణమేమంటే రష్యా ప్రాతినిధ్యంగల శాంతి సమావేశం కన్న అమెరికావారు ఏర్పాటు చేసిన ప్రస్తుతప్రభుత్వం జపానుకు చాలా మేలు చేస్తుందని వారి విశ్వాసం.

### రష్యాలోని జపానీయులు

టోకియో, నవంబరు 20: రష్యాలో మిగిలిఉన్న 1,60,000 జపానీయులను నెలవారీగా జపానుకు తిప్పిపంపడానికి గాను జనరల్ మెక్ ఆర్థరు ఒక పథకం సూచిస్తూ సోవియట్ ప్రభుత్వానికి లేఖ వ్రాయగా రష్యావారా పథకాన్ని ఆమోదించలేదట.

## కావలెను

కొత్తగూడెంలో (హైదరాబాదు స్టేటు) మా ఆంధ్రదైనిక, సచిత్ర వార, భారతి మాసపత్రికలను వారి స్వంత బాధ్యతపై విక్రయించుటకు న్యూసుఏజెంట్లు కావలెను. వివరములకు:

మేనేజరు,

ఆంధ్రపత్రిక. జి. టి. మద్రాసు.


## గంటల పంచాంగం

విరోధి సం॥ మార్గశిర శు॥ ద్వితీయ 1949 సం॥నవం॥ 22 మంగళవారం

మం॥ ద్వితీయ ఉ 6-56 తదియ తె 4-32 జ్యే ఉ 6-27 మూ తె4.44 వర్జ్యం ప1-53 ల 3-22 వ. రా వ 3-15 ల 4-44 వ.

శు॥ చవితి నవం॥ 23 బుధవారం

బు॥ చవితి రా 2.48పూ.షా రా 3.45వర్జ్యం ప 1-56 ల 3-28 వ.




# ఆంధ్రపత్రిక

విరోధి సం॥ మార్గశిర శు॥ ద్వితీయ మంగళవారం


## విద్యాసంస్థల విధులు: రాజకీయవేత్తల భావాలు

ప్రధానమంత్రి పండిట్ జవహర్లాల్ నెహ్రూ అమెరికా, కెనడాలందు చేసిన ప్రసంగములన్నింటియందు "నైతిక ప్రమాణముల" విలువనుగురించియే విశేషముగ వివరించియుండిరి. ఆర్థిక, రాజకీయ వ్యవహారములందు వ్యక్తులు, ప్రభుత్వములు నైతిక సూత్రములకు కట్టుబడియుండుట యవసరమని ఉద్ఘాటించిరి. మూడు దశాబ్దములలో ప్రపంచము రెండు యుద్ధములను కొనసాగింపవలసి వచ్చుటకు దేశములు నైతికముగ పతనమందుటే కారణమని, ద్వితీయ ప్రపంచ సంగ్రామానంతరము రాజకీయవేత్తలు నైతము గ్రహింప కలిగిరి. ప్రపంచ నైతిక పతనమును నివారించినగాని శాంతి, మానవ కల్యాణము సాధ్యము గాదని గుర్తించిరి. కాని అట్టి పతనమునునివారించుటకుఅనుసరింపవలసినమార్గములను వీరు తెలుసుకొనలేకుండిరి. భారతదేశము అట్టి మార్గమును గ్రహించెనుగాని, ఇంకను ఆ మార్గమును అనుసరింపలేకున్నది.

కాశీ హిందూ విశ్వవిద్యాలయ స్నాతకోపన్యాసమునందు శ్రీ కె. యం. మున్షిగారును, ఆగ్రా విశ్వవిద్యాలయ స్నాతకోపన్యాసమునందు శ్రీ సంపూర్ణానంద్‌గారును ఈ విషయములనే పేర్కొనియుండిరి. భారతీయ సంస్కృతి ప్రస్తుతము ఒక సంకటస్థితిని ఎదుర్కొనుచున్నదని, విశ్వకళాపరిషత్తులు ఈ పరిస్థితులను తొలగించవలసియున్నదని మున్షిగారు హెచ్చరించిరి. "మన విద్యాసంస్థలందు నైతిక, సామాజిక ధర్మములకు తిరిగి స్థానము కల్పించి అట్టి ధర్మములను బోధన జరిగినగాని మనకు మోక్షములేదని" మున్షిగారి యభిప్రాయముతో ఏకీభవింపనివారుండరు. భారతదేశము స్వాతంత్ర్యము పొందిన అనంతరముకూడ మన విద్యాసంస్థలు సంకుచిత కులవిచక్షణకు రంగస్థలముగా సర్వమానవ సౌభ్రాతృత్వమునకు ప్రాతిపదికలను వేయవలసిన పవిత్రస్థలములు స్వాతంత్ర్య సాధనకు పరికరము లగుచున్నవి.

భారతీయ సంస్కృతి ప్రాచీన ప్రాభవమునుపొంది సాంఘిక జీవనమున నైతిక ప్రమాణములకు తిరిగి పూర్వపుస్థానమును కల్పింపవలెనన్న ఈ విద్యాసంస్థల నిర్వహణ విధానము, నిర్వాహకుల దృక్పథము విప్లవాత్మకమైన మార్పును చెందవలసి యున్నది. ప్రజల, ప్రజానాయకుల, పాలకుల దృక్పథమునందు దట్టిమార్పు వచ్చుటకు నూతన రాజ్యాంగము దోహదము చేయవలసియున్నది. కాని సంపూర్ణానంద్‌గారు వివరించినట్లు మన నూతన రాజ్యాంగమునకు తాత్విక ప్రాతిపదిక లేనందువలన మన రాజ్యాంగము లక్ష్యించిన ఆదర్శ సంఘము సర్పడగలదను ఆశ కలుగుటలేదు.

నైతికసూత్రములకు బద్ధులై ప్రజలు, ప్రభుత్వములు వ్యవహారముల నిర్వహించుట యవసరమను ఉద్ఘాటనలు అధికమగుచున్నకొద్ది ప్రజలలో 'అరాచక మనస్తత్వము' వృద్ధియగుచున్నది. సామాజిక వ్యవస్థ సంస్కారమునకు, భారతీయ సంస్కృతి పునరుద్ధరణకు విద్యావిధానము మార్పుచెందుట యవసరమే. విద్యాలయములు వాస్తవమైన విశ్వకళాపరిషత్తులుగ పరిణామమందవలెను. ఈ మార్పు అప్రయత్నముగ, దానికదే జరుగుట అసంభవము. ఈ మార్పులన్నింటికిని ప్రధానము పాలకుల ప్రవృత్తి. ఈ సంధ్యానమయమున "పాలకుల మనః ప్రవృత్తి, పరిపాలనా విధానము" అత్యంత ప్రధానమైనవి. అధికారవర్గములు, పరిపాలన నైతిక ధర్మబద్ధమైనగాని ఇతరరంగములందు నైతిక, సామాజిక ధర్మసూత్రములు వాటిస్థానమును పొందజాలవు. ఏ సంస్కారమునకైనను ప్రధానము "ఆత్మసంస్కారము." నేడిది సర్వత్ర లోపించి యున్నది. వ్యక్తికిగాని, జాతికిగాని, దేశమునకుగాని అట్టి ఆత్మసంస్కారము కలిగిననగాని ఎట్టి సామాజిక వ్యవస్థ చిరకాలము మనజాలదు. అట్టిఆత్మసంస్కారము కలుగుటకు విద్యాసంస్థలు సాధనలు మాత్రమే కాగలవు. ఆ సాధనల సద్వినియోగము చేసుకొనవలసిన బాధ్యత అందరిది. ఆ బాధ్యతను గ్రహించినపుడే నైతికధర్మవర్తనులై ప్రజలు సుస్థిర ప్రపంచ శాంతిని సాధింపగలరు. మున్షి, సంపూర్ణానంద్‌గార్లు కాశీ ఆగ్రా స్నాతకోపన్యాసములందు, ప్రధానమంత్రి పండిట్ నెహ్రూ ఢిల్లీ సభలో చేసిన ఉపన్యాసమునందు ఈ విషయమునే ప్రబోధించిరి. ఈ బోధనలను గ్రహించి ఆ ప్రకారము తమ జీవిత విధానమును మార్గమును సరిదిద్దుకొనుటకే ప్రతి ఒక్కరు ప్రయత్నింపవలసి యుండును.

## రక్షణ సన్నాహాలపై అమెరికా శ్రద్ధ

### రష్యాకు అణువు బాంబులున్న ఫలితం

వాషింగ్టన్, నవంబరు 21: రష్యాకు అణువుబాంబు ఉన్నట్లు తెలియవచ్చినందువల్ల అమెరికా విధానాలలో మార్పు కలిగింది. నావు అణ్వస్త్రాలకు ప్రాముఖ్యం ఇవ్వటం తగ్గించి, రక్షణసన్నాహాలకు ప్రాముఖ్యం ఇస్తున్నాను.

అణువుబాంబులను వివిధ ప్రాంతాల మీద వేయటం లో నూ, అణువుబాంబు ప్రయోగాన్ని నిరోధించటంలోనూ గల చిక్కులు విస్పష్టంగా గుర్తించబడుచున్నవి.

అణువుబాంబుకు ప్రతిఅయిన విరుగుడు మరొక బాంబున్నదను. అవి నగరాలు ధ్వంసంచేయవలెను కాక విమానాలు ఎక్కడ ఎప్పుడుపోయి పేలుతుందను (గ్లోబ్)

## ఆస్ట్రేలియా గోధుమ ధర హెచ్చింపు

### కొలంబో సభలో చర్చకు వచ్చే సూచన

లండను, నవంబరు 20: కొలంబోలో జరుగనున్న కామన్వెల్తు విదేశాంగమంత్రుల సమావేశానికి ఒక కారణం ఆస్ట్రేలియా తన గోధుమలకు అధికమైనధర అడగడమని" "పీపుల్" అనే పత్రిక నేడు వ్రాసింది.

"కామన్వెల్తులో తనకు వాగ్దానం చేయబడిన సముగ్రహమైన ప్రతిపత్తిని గురించి అసలే అనుమానంతో ఉన్న ఇండియా, సింహళాలకు ఆస్ట్రేలియా గోధుమల ధర పెంచడం మరింత ఆందోళన కలిగిస్తున్నది. బ్రిటను అడుగుజాడలలో తమ ద్రవ్యాల మారకం రేటు తగ్గించుకొన్న ఈ దేశాలు, అంతర్జాతీయ ఒప్పందంలో ఒకనిబంధనను పురస్కరించుకొని ఇప్పుడు మరొక కామన్వెల్తు దేశంలోని గోధుమలకు అధికమైన ధర ఇవ్వవలసివస్తే అది వారికి మరింత అక్రమంగా తోచగలదు.

"పండిట్ నెహ్రూ, తాను ఉద్దేశించిన విధంగా, అమెరికాకు మాంగానీసూ, అభ్రకమునిచ్చి గోధుమలు తీసుకొన్నట్టయితే, కామన్వెల్తు డాలరునిధికి పెద్దనష్టం జరుగుతుంది. కాని ఈ విషయమై బ్రిటిషువారు ఎట్టి ఆక్షేపణగాని తెలిపితే పండిట్ నెహ్రూ ఆస్ట్రేలియాను వేలుపెట్టి చూపవచ్చును" అని ఈ పత్రిక సంపాదకీయములో వ్రాసింది.

## కామన్వెల్తు విదేశాంగ మంత్రుల సభ

### పీటూనును ఎజెండాలో చేర్చాలని పాకిస్థాన్ సూచన

కరాచీ, నవంబరు 19: కొలంబోలో జరుగబోయే కామన్వెల్తు విదేశాంగ మంత్రుల సమావేశపు ఎజెండాలో, పీటూనును గూడా చర్చనీయాంశముగా చేర్చాలని పాకిస్థాన్ సూచించినట్టు తెలియవచ్చింది.

## జాతీయచైనా తాత్కాలిక అధ్యక్షుడు లీటుస్సంగ్

హాంకాంగ్, నవంబరు 20: జాతీయ చైనా తాత్కాలికాధ్యక్షుడు లీటుస్సంగ్ జెన్ కడుపునొప్పితో బాధపడుతూవున్న కారణం వైద్యసహాయంకోసం హాంకాంగ్ కు వస్తున్నారు.

అదివరకు ఈనొప్పి ఒకమాదిరిగావుండేది. కాని ఈ మధ్య ఆయన పశ్చిమ చైనాలో పర్యటించిన కారణంగా అది తీవ్రతరమైంది.

ఇందులో తాను తన బాధ్యతలను వదులుకుంటూవున్న దేమీలేదని, త్వరలో తిరిగి తాను చుంకింగ్‌కు రాగలనని గూడా ఆయన తెలియజేసారు.

అంతదాకా ప్రభుత్వకలాపాన్ని ప్రధాని యెన్‌షిషాన్ నడుపుతారు.

### చాంగ్‌కైషేక్‌తో విభేదాలు

హాంకాంగ్, నవంబరు 20: చైనా జాతీయ ప్రభుత్వ తాత్కాలిక అధ్యక్షుడు లీటుస్సంగ్‌జెన్ నేడు క్వాంగ్సీ రాష్ట్రమునుంచి ఇక్కడికి వచ్చాడు. ఇతడికి, జనరలిసిమో చాంగ్ కై షేక్ కూ నీతో విభేదాలు ఏర్పడినట్లు వదంతులు పొక్కడంకేత ఇతడిరాకకు ప్రాధాన్యం ఇవ్వవలసివుంటున్నది.

## చైనాలోని అమెరికా రాయబారి

### కార్యాలయం ఎత్తివేసి హాంకాంగ్‌కు రాక

హాంకాంగ్, నవంబరు 20: జాతీయ చైనాలో అమెరికా రాయబారిగా వున్న రాబర్ట్ స్ట్రాంగ్ తన కార్యాలయాన్ని చుంకింగ్ నుంచి గూడా ఎత్తివేసి, హాంకాంగ్ చేరుకున్నారు.

ఇప్పుడు ఇక అక్కడి అమెరికన్ వ్యవహారాలను గూడా బ్రిటిష్ కౌన్సల్ జనరల్ మైకేల్ యస్ గిడెన్ చూస్తూ వుంటారు.

తిరిగి తన ప్రభుత్వం దగ్గర నుంచి ఉత్తర్వులు వచ్చేదాకా తాను హాంకాంగ్‌లోనే వుండగలనని రాబర్ట్ స్ట్రాంగ్ పత్రికా విలేఖరులకు తెలియజేసారు.

### కమ్యూనిస్టు చైనాతో అల్బేనియా సంబంధాలు

టిరానా, నవంబరు 20: చైనా ప్రజాప్రభుత్వంతో అల్బేనియా రాజకీయ సంబంధాలు ఏర్పాటు చేసుకొనిన నిర్ణయించినట్లు నేడు అల్బేనియా రేడియో ప్రకటించింది.

## నెహ్రూ ఉద్బోధ

(1-వ పేజీ తరువాయి)

బాధ్యతా విరహితమైన, అసంగత పూర్వకమైన ప్రసంగం ఇంకోటివుండదు. యుద్ధం ఒకలక్ష్యంకాదు. అది ఒకమార్గం మాత్రమే. దానివల్ల మంచికలగవచ్చు. చెడు సంభవించవచ్చు. దానివల్ల జననష్టం చాలా అవుతుంది. లోకం సంక్షోభించిపోతుంది. అటువంటిదాన్ని ఒకవిలాస వ్యవహారంగా పాటించడంకన్నా బుద్ధితక్కువపని ఇంకోటిలేదు. అయినా భారతదేశం అవసరసమయంలో గాజులు తొడుక్కు కూర్చోదు. ధర్మనియమాన్ని పాటించక, ఈవివాదాని తిరచ్చిన ఎవరిపైనాపరే సైనిక బలంతో నొక్కి పార వేస్తుంది.

కొంతమంది నేను అమెరికాకు అమ్ముడుపోయానంటున్నారు. దేశాన్ని తీసుకుపోయి అమెరికాకు అమ్మజూపుతున్నానంటున్నారు. ఇటువంటి వారికి నేను చెప్పేది ఒక్కటేమాట. వారు నన్ను సరిగ్గా అర్థంచేసుకోలేదు. ఇండియా ఎప్పుడూ కూడ రాజకీయాల్లో తలదూర్చదు. ఏబలాఢిక రాజ్యానికి "సామంతుని"గా పడివుండదు. ఇతరరాజ్యాలమధ్య సహకారాన్ని, సయోధ్యను పెంపొందింప చేయగల్గితే, అది మహాభాగ్యంగా ఇండియా అంగీకరిస్తుంది. ప్రపంచశాంతినే ఇండియా ఆకాంక్షిస్తున్నది. ఇంకో ప్రపంచయుద్ధం వస్తే సకం ప్రపంచం నాశనం అవుతుంది. ఇంకోసగం నడిపిసుగా అయిపోతుంది.

అనంతరం నెహ్రూ దేశఆర్థిక పరిస్థితినిగూర్చి మాటలాడారు. దేశం ఈవిధమైన విపరీత పరిస్థితి ఏర్పడడానికి గత ప్రపంచ సంగ్రామం కారణమని ఆయన అన్నారు. ఈ పరిస్థితినుంచి బయటపడటానికి దేశసంపదను ఇనుమడింప చేయడం ఒక్కటే మార్గమని ఆయన స్పష్టం చేసారు. దేశంలో ప్రజానీకంయొక్క జీవన ప్రమాణం జాతీయసౌభాగ్యంమీద ఆధారపడివుంటుంది. అందువల్ల పారిశ్రామికవస్తూత్పత్తిని ఇతోధికంగా అభివృద్ధి చేయవలసిన అవసరం కల్గుతున్నది. ఇది ప్రభుత్వం కొన్ని శాసనాలు చేసినంత మాత్రంచేత అయ్యేపనికాదు. ఇందులో ప్రజలుగూడా ప్రభుత్వంతో సహకరించి పనిచేయాలి.

వట్టి కబుర్లతో ఎంతమాత్రంపనిజరుగదు. ఈకబుర్లు చెప్పేవాళ్ళను చూచినా, ఇంకా కొంతమందిని చూచినా నాకు ఆశ్చర్యం వేస్తూవుంటుంది. ఈ రెండోరకంవారికి అసలు విశాలదృష్టేలేదు. ప్రతివిషయాన్ని వారుచాలా సంకుచితంగా చూస్తారు. ఇంకోరకంవారువున్నారు. వారిది మరీమూకుడు వ్యవహారం. ఉట్టిమీదనుంచి స్వర్గానికే ఎగరాలన్నంత ఆవేశంతో వారు తాపత్రయ పడుతూ వుంటారు. ఇవిఅన్నీ ఆచరణ సాధ్యాలు కాని విషయాలు. అప్పుడు అంతా పూహించవలసింది. దేశాన్ని స్వయం పోషకం చేయాలన్న విషయమే. అందుకోసమే ప్రభుత్వం కృషి చేస్తున్నది. అందు నిమిత్తమే భారీప్రణాళికల కొంత నెమ్మదిగా అమలు జరపాలని గూడా ప్రభుత్వ నిశ్చయించింది. నెమ్మదిగా అన్నంత మాత్రంచేత ఆ ప్రణాళికలను విరమిస్తుందని అర్థంకాదు. తాత్కాలికంగా వాటిని ఆపివుంచింది.

ఇటువంటి పరిస్థితులలో ఈ 'ఇజం'ను గూర్చి, ఆఇజంనుగూర్చి మాట్లాడటం మంగినదికాదు. తమకు ఏ 'జం' నచ్చితే ఆ 'ఇజంను' ప్రజలే స్వీకరిస్తారు. అందువల్ల ఈ 'ఇజం'లను పట్టుకు ప్రాకులాడే వ్యక్తులతో కల్లోలపెట్టడం భావ్యంకాదు. ఒకరి మార్గాలను అవరోధించడం మంచిదికాదు. అన్ని 'ఇజం'లు, అన్ని దేశాలకు అన్ని వేళల సరిపడవు. ప్రజలు నెరవేర్చవలసిందల్లా, ఐక్యమత్యంతో పని చేస్తూ తమసమస్యలను ఋజుమైన మార్గంలో పరిష్కరించుకోవటమే.

ఈ ఆర్థిక సమస్యల పరిష్కారం ఎక్కువగా మనం ఆహార సమస్యను పరిష్కరించుకోవడంమీద ఆధారపడి వుంటుంది. దేశ ఆర్థిక స్థితికి ఆహార సమస్య మూలమైంది. వచ్చే రెండేండ్లలోను దేశానికి తగినంత ఆహారాన్ని సమకూర్చాలని ప్రభుత్వం ప్రయత్నం చేస్తున్నది. నేను అమెరికానుంచి తిరిగివచ్చిన తరువాత ఆహారపరిస్థితిగూర్చి ఇంకా పరిశీలించలేదు. నేను అట్లా పరిశీలనచేసి, దాన్ని గూర్చి మీకు నివేదిస్తాను. కాని ఇప్పుడే ఒక్క విషయాన్ని స్పష్టంచేసివేస్తాను. మరి రెండు సంవత్సరాల అనంతరం ఇక ఆహారధాన్యాలను దిగుమతి చేసుకోవడం అంటూవుండదు. అప్పటికూడా దేశంలో కొరతవుంటే, దాన్ని మనం స్వయంగా పండించుకోవలసిందే, ఆహారధాన్యాల దిగుమతులమీద ఖర్చుపెడుతున్న డబ్బు ఎందుకూ కొరగాకుండా పోతున్నది. అందువల్ల ప్రజలు ఆహారవిషయాలలో చాలా జాగ్రత్తగా మెలగాలి, దాన్ని దుబారాగా వాడరాదు. పాడుచేసుకోరాదు.

నేను అమెరికాలో చాలా పంట పండుతుంది. ఆ పంటను ఏమిచేసుకోవాలో తెలియకవారు దాన్ని నానాపాడు చేస్తూవుంటారు. వారికిఇంత పంట పండుతోందంటే, మనం కి ఉత్పత్తి విధానాన్ని హర్షించవలసి వుంది.

తరువాత నెహ్రూ పండితుడు ఇండో పాకిస్థాన్ సంబంధాలనుగూర్చి మాట్లాడారు. ఇండియా పాకిస్థాన్‌లు కలిసి పరిష్కరించుకొనవలసిన సమస్యలు ఇంకా నాలుగు వున్నాయన్నారు. అవి (1) కాశ్మీర్ సమస్య (2) కాందిశీకుల ఆస్తి (3) పంజాబు కాలువలనీటి సరఫరా సమస్య (4) రూపాయిల మారకం రేటు.

కాని ఈనాలుగు సమస్యలు యుద్ధం వల్ల తేలేవికావు. యుద్ధంవల్ల వినాశనం తప్పదు. కాని యుద్ధం అంటే ఇండియాకు భయం ఎంతమాత్రం లేదు. అట్టిది సంభవిస్తే దాన్ని మనం సరిగ్గానే ఎదుర్కొంటాం. కాశ్మీరములో ఇండియా యుద్ధం చేసింది. అంతకు వినా ఇంకోమార్గంలేదు కాబట్టి అట్లా చేయవలసివచ్చింది. మహాత్మాగాంధీ గూడా దీన్ని ఆమోదించారు. అప్పుడు ఇండియా గనుక కాశ్మీర్‌కు సహాయంగా పోకపోయినట్లయితే అస్థానం యదాయదలైపోయి వుండేది.

అనంతరం నెహ్రూ, అమెరికాను గూర్చిన తన అనుభవాలు చైనాసమస్య వీటినిగూర్చి ప్రసంగించారు. అమెరికాను గూర్చి మాట్లాడుతూ, అచ్చటిప్రజలుతీవ్రమైన యుద్ధభయంతో సతమతమై పోతున్నారని ఆయన చెప్పారు. అదీకాకుండా ప్రస్తుత ప్రపంచంలో అమెరికాప్రజలు పెద్దబాధ్యతను నిర్వహించవలసివుంది. ఇప్పుడు ప్రపంచంలో అగ్రరాజ్యాలు ఒక విచిత్రమైన పెనుగులాటను ప్రారంభించాయి. అమెరికావాండ్లలో ఇరుక్కుపోయింది. ఈ పెనుగులాటనుగూర్చి అమెరికాలో చాలామందినన్ను ప్రశ్నించారు. నేను అహింసావిధానాన్నిగూర్చి వారికినచ్చ చెప్పాను. అది వారికినచ్చింది.

చైనానుగూర్చి మాట్లాడుతూ, ఇప్పుడు అక్కడప్రవర్తిల్లుతూవున్న విప్లవం అతి ప్రముఖమైనదన్నారు. ఆ విప్లవంవల్ల సకలమైన ఆసియా దేశాలలోను తీవ్రమైన మార్పులు రాకతప్పవన్నారు. ఇటువంటి సమయంలో ఇండియా ఐకమత్యంతో ఉండవలసిన అవసరం ఎంతైనావున్నదన్నారు. లేకపోతేమనం వెనకపడిపోతాం, తక్కినదేశాలన్నీ మనల్నిమించిపోతాయి అని ఆయన హెచ్చరించారు.

తన ఉపన్యాసాన్ని ముగిస్తూ పండిట్ నెహ్రూ ఈలా అన్నారు. ప్రపంచంలో అందరు శాంతినే ఆకాంక్షిస్తున్నారు. కాని యుద్ధంవస్తుందనిభయపడే రాజకీయవేత్తలుమాత్రంఅన్ని దేశాల్లోనువున్నారు. అయినా ప్రపంచంలో అన్నిరాజ్యాలు తమ తమ సమస్యలను శాంతియుతంగా పరిష్కరించుకుంటే ఈ యుద్ధభయం ప్రపంచంలోంచి అంతర్హితమైపోతుంది.

## నెహ్రూ ఉపన్యాస వేదిక

### రెండు సార్లు కూలింది

న్యూఢిల్లీ, నవంబరు 20: రామలీలా మైదానంలో పండిట్ నెహ్రూ ఉపన్యసిస్తున్న సందర్భంలో ఉపన్యాసవేదిక రెండుసార్లు కూలింది.

మొదటిసారి వేదికలో ఒక భాగం కూలింది. రెండోసారి వేదిక క్రిందకు క్రుంగింది. ఈ సందర్భంలో గాయాలు ఎవరికీ తగలలేదు.

రెండోస్సారి వేదిక క్రుంగినప్పుడు పండిట్ నెహ్రూ కొంచెంగా వంగాడుగాని, తిరిగి సరిగ్గా నిలబడి, క్రిందపడిపోయిన, బాబా ఖారక్‌సింగ్‌ను లేవదీశారు.

### 60 ఏళ్లు వచ్చినా విద్యార్థి దశ

న్యూఢిల్లీ, నవంబరు 20: 60 ఏండ్లు వచ్చినా తన ఇంకా విద్యార్థిదశ వదలలేదని నేడు పండిట్ నెహ్రూ చలోక్తిగా అన్నారు.

ఇవ్వాళ్ళ ఇక్కడ జరిగిన బహిరంగ సభలో మాట్లాడుతూ 60 ఏండ్లు వచ్చినా ఇప్పటికూడా తాను విద్యార్థిలాగే వున్నానని, ఇంకా క్రొత్తవిషయాలు తెలుసుకోవాలనే జిజ్ఞాస తనకు వదలలేదని అన్నారు.

ఈ మధ్య అమెరకాలో పర్యటించినప్పుడు, ఆదేశప్రజల దగ్గరనుంచి అనేక విషయాలను తెలుసుకోగల్గానని ఆయన అన్నారు.

## ఉత్తర అట్లాంటిక్ రక్షణ పథకం

వాషింగ్టను, నవంబరు 21: రెండు మాసాలుగా రహస్యసమావేశాలు జరుపుతున్న ఉత్తర అట్లాంటిక్ ఒడంబడిక రాజ్యాల స్థాయీసంఘంవారు ఉత్తర అట్లాంటిక్ ప్రాంతీ రక్షణ పథకాన్ని తయారుచేసి ఆమోదించినట్లు తెలుస్తున్నది.

ఇంతవరకు అతి గోప్యంగా ఉంచిన రక్షణ పథకాన్ని అమెరికా మొదటిసారిగా యూరపు సైనిక నిపుణులకు వివరించింది. యూరపు రక్షణ సంఘాలవారు తయారుచేసిన పథకాలలో దీనిని సమన్వయించి సమగ్ర రక్షణ పథకం తయారు చేశారు. (గ్లోబ్)

## తుపాను బాధితులకు సహాయం

### షరీఫ్‌చే బహిరంగసభ ఏర్పాటు

చెన్నపట్నం, నవంబరు 21: షరీఫ్ పి. ఎమ్. కోఠారిగారిట్లు వ్రాసిరి: ఆంధ్రదేశంలో ఇటీవల వచ్చిన తుపానువల్ల బాధితులైనవారికి సహాయ ఏర్పాట్లు చేసే విషయం ఆలోచించుటకు చెన్నపట్నం పౌరుల బహిరంగ సభ 25 తే సాయంత్రం 6 గం రాజాజీహాలులో జరుగును. గవర్నరు భావనగర్ మహారాజా అధ్యక్షత వహించెదరు. ప్రజలందరు పాల్గొనవలెనని కోరడమైనది.

### సినిమాపరిశ్రమ తరపున నిధి సేకరణకు సంఘం

మద్రాసు, నవంబరు 21: ఆంధ్రదేశంలో ఇటీవలవచ్చిన తుపానువల్ల అనేక కష్టనష్టముల పాలైన బాధితుల సహాయార్థం సినిమాపరిశ్రమ తరఫున నిధిసేకరించుటకు ఘంటసాల బలరామయ్యగారు అధ్యక్షులుగా ఒక సంఘం ఏర్పాటు చెయ్యబడింది. దీనికి ఉపాధ్యక్షులు శ్రీమతి పి. భానుమతి శ్రీమతి పి. కన్నాంబ ఎస్. ఎస్. కృష్ణన్ కె. సుబ్రహ్మణ్యంగారలు ప్రధానకార్యదర్శి పి. ఎస్. రామకృష్ణ గారు సహాయకార్యదర్శులు శ్రీమతి జి. వరలక్ష్మి శ్రీమతి అంజలీదేవి ఎం లింగమూర్తి ఇంటూరి వెంకటేశ్వరరావు గారలు. కోశాధిపతి కె. బి నాగభూషణంగారు ఈ సంఘంలో సభ్యులు. ఎస్. ఎస్. వాసన్ టి. ఆర్. సుందరం ఎం. సోము. బి. నాగిరెడ్డి బి. ఎన్. రెడ్డి నిర్మాపురి రాజా కె. శ్రీ రాముల నాయుడు చిత్తూరు వి. నాగయ్య పి. పుల్లయ్య, సముద్రాల రాఘవాచార్య ఎ.వి. మెయ్యప్ప చెట్టియార్ గారలు.

సంఘసభ్యులు కొంతమంది బయలుదేరి నిన్నటినుండి విరివిగా విరాళములు సేకరించటం ప్రారంభించారు. ఫిలింపరిశ్రమలోని వారందరు యీ నిధికి విరివిగా విరాళము లివ్వవలసిందని సంఘ అధ్యక్షులు విజ్ఞప్తి చేస్తున్నారు.

సంఘకార్యాలయం 58, గోవతి నారాయణస్వామి చెట్టిరోడ్డు టి. నగర్‌లో ఏర్పాటు చెయ్యబడింది.

## విద్యార్థి కాంగ్రెసు కర్తవ్యము

విజయవాడ, నవంబరు 20: ఆంధ్ర రాష్ట్రవిద్యార్థికాంగ్రెసు అధ్యక్షులు సుంకర సత్యనారాయణగారిట్లు వ్రాస్తున్నారు.

ఆంధ్రకోస్తా జిల్లాలలో యిటీవల వచ్చిన తుపానువలన లక్షలకొలది ప్రజలు నిరాశ్రయులై అన్నవస్త్రాలలేమితో బాధపడుచున్న విషయం సర్వవిదితమే. అట్టి బాధితప్రజానీకానికి సత్వర సహాయము చేయవలసిన బాధ్యత ఆంధ్ర విద్యార్థులపైనున్నది. వివిధరాష్ట్ర గవర్నర్లు సహాయనిధి సేకరణకు పూనుకొనడం ముదావహం. గుంటూరు, కాకినాడ నగరవిద్యార్థి కాంగ్రెసులు సహాయనిధి సేకరణ చురుకుగా సాగిస్తున్నారు. కాన మిగిలిన ప్రాంతాలలోని విద్యార్థులందరు సహాయనిధికి విరివిగా విరాళములిచ్చి తోడ్పడవలసినదిగాను ప్రతి స్థానిక విద్యార్థి కాంగ్రెసు సంఘము సహాయనిధిని సేకరించి రాష్ట్ర గవర్నరుకు పంపవలసినదిగాను ప్రార్థిస్తున్నాను.

## మదరాసు గుఱ్ఱపు పందెములు

చెన్నపట్నం, నవంబరు 21: మదరాసు గుఱ్ఱపు పందెముల సీజను నిన్న మామూలు పద్ధతిపై పందెముల నిషేధం లేకుండా ప్రారంభమయ్యెను. మొదటిరోజు పందెములలో ఎప్పటివలె జనసమూహము అంతగా ఎక్కువ లేకుండెను. గుఱ్ఱపు పందెములు, అసలే నుండరాదనే అభిప్రాయములో గల కాంగ్రెస్ పార్టీకి చెందిన కొందరు శాసన సభ్యులు సయితము నిన్నటి పందెములకు హాజరైరి. మొత్తం మీద నిన్న జరిగిన 7 పందెములలో చాలా వరకు పంటర్లు ఎంచిన గుఱ్ఱాలే నెగ్గినవి. ఎవరు అనుకోని "మోహిం" అనే గుఱ్ఱము 4 వ పందెములో నెగ్గి రూ. 188 డివిడెండ్ నిచ్చినది డబిల్ టోట్‌లో 88 టికెట్లకు చెరి రూ 86 ట్రెబిల్ టోట్‌లో 142 టికెట్లకూ చెరి రూ 146 లభించెను.

## తుంగభద్ర క్రింద పునరావాస చర్యలు

మదరాసు, నవంబరు 21:—తుంగభద్ర ప్రాజెక్టువలన స్థానభ్రష్టులైన వారికి పునరావాసము కల్పించు విషయమై ఇటీవల జరిగిన ఉద్యోగుల సమావేశములో కొంత అదనపు ఖర్చు అయిననూ భరించి స్థానభ్రష్టులైన జనులకు సహాయము చేయవలెననియు, ప్రాజెక్టు అంచనాలలో పునరావాసమునకు అగు ఖర్చును అదనముగా చేర్చవలెననీ, పరిశీలించి పునరావాస ప్రణాళికను తయారుచేయుటకు తగిన ఉద్యోగిని ప్రత్యేకముగా నియమించుటకున్నూ నిర్ణయించబడెనని పబ్లిక్ వర్క్స్ మంత్రి భక్తవత్సలంగారు నేడు కర్నూలులో శ్రీ ఆర్. సూర్యనారాయణ గారికి తెలిపిరి.

## అమెరికా-భారతదేశ స్నేహసంబంధాలు

### ఢిల్లీలో ఉభయరాజ్య ప్రతినిధుల సభ ప్రారంభం

న్యూఢిల్లీ, నవంబరు 20: ఢిల్లీ విశ్వవిద్యాలయములో డిసెంబరు 12 నుండి 22 తేదీవరకు జరుగనున్న అనధికార భారత-అమెరికన్ సభకు యిచ్చటి రాజకీయ పరిశీలకులు చాలా ప్రాముఖ్య మొసంగుచున్నారు. అమెరికన్ పసిఫిక్ వ్యవహారముల సంస్థ, ప్రపంచ వ్యవహారముల భారత సంఘముల యాజమాన్యమున జరుగుచున్నది పరస్పర సుహృద్భావన, సహకార భావములను పెంపొందించుటయు, ఉభయ దేశములకు సంబంధించిన విషయములను గూర్చి పరిశోధన సాగించుటయు ఈ సభ ఉద్దేశ్యమై యున్నది. ఉభయ దేశముల రాజకీయ, రాజ్యాంగ, వాణిజ్య, ద్రవ్య సంబంధములనుగూర్చి పరిశోధన జరుపుట సభ ఉద్దేశ్యము. ఉభయదేశముల వైజ్ఞానిక సంబంధములనుగూడ దృఢపరచుట ఈసభ ఉద్దేశ్యము. ఈసభకు హాజరగు భారతప్రతినిధులలో శ్రీ జి. డి బిర్లా, మావలంకర్, పండిత కుంజ్రూ, ఆచార్య రంగా, శ్రీమతి కమలాదేవి ఛటోపాధ్యాయా, ఎం. సి. సెటిల్వాడ్, సర్. సి. పి. రామస్వామి అయ్యర్, శ్రీ టి. టి. కృష్ణమాచారి, శ్రీ సి. ఆర్. శ్రీనివాసన్ మున్నగువారు కలరు. అమెరికా పక్షమున 25 మంది సుప్రసిద్ధ అమెరికనులు పాల్గొందురు.

## నైగీరియాలో పోలీసు కార్మిక సంఘర్షణ

### 18 మంది మరణం: పలువురికి గాయాలు

లాగాస్ (నైగీరియా) నవంబరు 20:- నైగీరియాలో ఎనుగూ బొగ్గుగనుల ప్రాంతంలో కార్మికులకు, పోలీసులకు శుక్రవారం నాడు సంఘర్షణ జరిగింది. ఈ సంఘర్షణలో 18 మంది కార్మికులు మరణించారు. 81 మంది గాయపడ్డారు. అనేకమంది పోలీసులుగూడా క్షతగాత్రులైనారు. ఈవిషయాన్ని, నేటిరాత్రి నైగీరియా ప్రభుత్వం ప్రకటించింది.

గని కార్మికుల భార్యలు, యజమానుల యిండ్లకు నిప్పంటించి, సమ్మె ఓచిత్తికి ప్రయత్నించే వారిపై తిరుగబడుట మూలంగా పోలీసులు కాల్పులు జరిపారని అనధికార వార్తలవల్ల తెలుస్తున్నది.

ఈ బ్రిటిష్ వలసరాజ్యంలో, 1500 మంది గని కార్మికులు, అధిక వేతనాన్ని కోరుతూ సమ్మె ప్రారంభించారు. కార్మికులు కోరిన వేతనాలిస్తే బొగ్గుధర పెరుగుతుందని, అందువల్ల ఎగుమతి వ్యాపారం పడిపోతుందని ప్రభుత్వం అభిప్రాయపడి, కార్మికుల కోర్కెలను రాకరించింది. ఎనుగూ బొగ్గుగనులలో కార్మిక అశాంతిని విచారించేందుకు తక్షణమే ఒక కమిషన్‌ను నియమించ దలచినట్లు నైగీరియా గవర్నర్ మెక్ఫర్సన్ ప్రకటించారు. (పి. టి. ఐ రాయిటర్.)

## ఆగ్నేయాసియా రక్షణ

### కమ్యూనిస్టు చైనా వల్ల చిక్కులు

లండను, నవంబరు 21: చైనా కమ్యూనిస్టు ప్రభుత్వాన్ని గుర్తించడం సమస్య కంటె, ఈ ప్రభుత్వంవల్ల ఆగ్నేయాసియా రక్షణలో ఏర్పడిన సమస్యలు చాలా క్లిష్టమైనవని నిన్న "సండే టైమ్సు" పత్రికలో "స్పెక్టేటర్" వ్రాశాను.

"పెచ్చుఉన్న రష్యా ప్రాబల్యంతో చైనా పెచ్చుపోవడంవల్ల హిందూ మహాసముద్రంలోగలదేశాలన్నిటికీ ముప్పున్నది. ఈ చైనా, ఉత్తరబర్మా టిబెట్టులు ఒకప్పుడు చైనా ఆక్రమణకిందవనే సాకుతో వాటిని ఆక్రమించినట్లయితే ఇండియా పాకిస్థానులగతి ఏమవుతుంది? గత యుద్ధంలో ఆర్థికంగా ప్రాముఖ్యం గలదని రుజువయిన ఉత్తరబర్మాను రష్యా అనుచర రాజ్యం (చైనా)ఆక్రమించితే ఇండియా, పాకిస్థానులకు చాలా ప్రమాదంఉంది" అని ఈ విలేఖరి అన్నాడు. (గ్లోబ్)

## 1950 ప్రారంభంలో మలాన్ విరమణ?

జొహాన్స్ బర్గ్, నవంబరు 21: దక్షిణాఫ్రికా ప్రధాని డా. డేనియల్ ఎఫ్. మలాన్ పైసంవత్సరారంభంలో ప్రభుత్వం నుంచి విరమిస్తాడనీ, ఆయన స్థానంలోకి ప్రస్తుత ఆర్థికమంత్రి నికొలాస్, సి. హావెంగా వస్తాడనీ, పైసంవత్సరారంభంలో ప్రస్తుత గవర్నరు జనరలు మేజరు వాన్‌జిల్ విరమించగానే ఆస్థానంలోకి డా॥ మలాన్ రావచ్చుననీ, ఆయన ఆరోగ్యంబాగులేని కారణంచేత ఈ మార్పులు జరుగుతవనీ తెలుస్తున్నది.

గవర్నరు జనరలుగా పనిచేయుటని జనరలు జాన్ క్రిస్టియన్ స్మట్సును కోరారని వదంతి పుట్టిందిగాని అది అబద్ధం. ఆయన ఆపనిని నిరాకరించి ఉంటాడు.

ఫిలిం ఆక్టర్
ఒక ఆక్టరుగాచేరి నెలకు రు 100/-ల నుండి రు 1,500/-ల వరకు సంపాదించాలని కోరిక వుంటే మాకు వ్రాయండి. మీరు ఎక్కువగా చదువు కొనకపోయినా పరవా లేదు. జాబులు యింగ్లీషులోనే వ్రాయాలి.
Director: Anand Film Service.
P. B. 61. Sitla Temple A. M. Amritsar.

టెండరు
కర్నూలులోని గవర్న మెంటు హెడ్ క్వార్టర్సు ఆస్పత్రి, నంద్యాల బనగానపల్లి, మార్కాపూరు గవర్న మెంటు ఆస్పత్రులకు కావలసిన ఆహారపదార్థములు, యితర ఆస్పత్రి సామానులు సప్లయి చేయుటకు 3-1-1950 సెలవు సుంకవారము మధ్యాహ్నము 2 గంటలవరకు సీలువేసిన టెండర్లు కోరబడుచున్నవి.
దిగువ సంతకముదారుకు వ్రాసి మిగిలిన వివరములు తెలిసికొనవచ్చును.
కర్నూలు 17-11-49 — ఆర్. షణ్ముగం పిళ్లె, డిస్ట్రిక్టు మెడికల్ ఆఫీసరు.

ఉబ్బసం మందు
5-12-49 పౌర్ణమినాడు దీనిని వాడితే ఒక మోతాదుతో ఉబ్బసం నయమవుతుంది. జాబులు ఇంగ్లీషులోగాని హిందీలోగాని వ్రాయండి.
Swami Darshnanand, Ayurvedashram.
Yagvedi P. O. Chitrakot Banda U. P.

జర్మన్ కెమేరా
యుద్ధానంతరం దిగుమతి చేయడం యిదే మొదటిసారి. ప్రారంభకులు గూడ యీ కెమేరాతో పెద్దసైజు 6×6 ఫోటోలు తీయవచ్చును. ఖరీదు రు 15-0-0. పోస్టేజి రు 1-8-0 అధికం. 12 ఫోటోలకు ఫిలిం ప్రతి కెమెరాతో ఉచితంగా యివ్వబడును. PARKER WATCH Co., 166, Harrison Road, Calcutta.

మదనకామేశ్వర లేహ్యం
ఇది మేహమును, నిర్బలత, నిస్సత్తువ, శుక్ల నష్టము, అతిమూత్రము, మొదలగువాటిని ఖండించి, మంచి బలమును వీర్యపటుత్వమును కలిగించుటలో అద్భుతమైనది 2 డబ్బీలు వాడుము, 80 తులముల డబ్బీ రు 2/- పోస్టేజి ప్రత్యేకము.
పి. సి. వి. అండ్ కంపెనీ.
ఆయుర్వేదసమాజం, చేరిజేడు,(నెల్లూరుజిల్లా) బ్రాంచి: 7. సీను మొదలివీధి, మద్రాసు.

25% to 50% CONCESSIONS for FAMILY TRAVEL to CALCUTTA
AIRWAYS (INDIA) Limited
AIRWAYS HOUSE
P. 37, MISSION ROW EXTN.
CALCUTTA
PHONE


# "కార్మికులకు సంఘంలో తగిన గౌరవం ఇవ్వాలి"

## కాశీ విశ్వవిద్యాలయస్నాతకోత్సవం: కార్మికమంత్రి జగ్జీవన్‌రాం ఉద్బోధ

బెనారస్, నవంబర్ 20: భారత కార్మికమంత్రి జగ్జీవన్ రామ్ ఈవేళ ఇక్కడ మాట్లాడుతూ మనకు ప్రస్తుతం ఉన్న సాంఘిక మూల్యాలలో మార్పు రావాలనీ, కార్మికులకు సంఘంలో తగినంత స్థానం ఇవ్వాలనీ అన్నారు.

భారత కార్మిక మంత్రి కాశీ విశ్వవిద్యాలయం స్నాతకోత్సవ సభలో కార్మికుల విధులను గురించి మాట్లాడుతూ ఈ మాటలు అన్నారు. ఆయన ఈ సందర్భంలో ఇంకా మాట్లాడుతూ, ఈ పరిస్థితులలో కార్మికులలో క్రమ శిక్షణ కావాలని అంటున్నంత మాత్రాన, కార్మికులు చెమట ఓడ్చి ఆర్జించిన దానిని అపహరించి జయ్యమని చెప్పడం లేదనీ కార్మికులను దోచుకునే విధానాన్ని తాము ఎంత మాత్రము సహించ బోవడం లేదనీ అన్నారు.

జగజీవన రామ్ ఇంకా ఇలాగ అన్నారు. "విద్యాసంస్థలందరు కార్మికులకు అన్ని విధాలా తోడ్పడాలి. పట్టభద్రులందరిచేత కాయకష్టంతో కూడిన పని కొంత విధిగా చేయించడం చాలా మంచిదని నా అభిప్రాయము.

మీరు నన్ను ఈ ఉపన్యాసం ఇవ్వవలసిందని ఆహ్వానించడం, యావత్ భారత దేశం అందరిలోనూ సంపూర్ణ సమానత్వం ఏర్పరచ బోవడానికి తార్కాణమని నా అభిప్రాయము. ఇంతకు పూర్వం నిమ్న జాతుల వారికి కొన్ని అన్యాయాలు జరిగాయి. అయితే పూర్వం జరిగిన ఈ అన్యాయాలన్నీ విస్మరించి నిమ్న జాతులు దేశక్షేమానికి కాయ కష్టంతో పాటు పడగలరని ఆశిస్తున్నాను."

కార్మికులను గురించి ముచ్చటిస్తూ జగ్జీవన్‌రామ్ ఇలాగ చెప్పారు. "కార్మికులు ఇంతకుపూర్వం అవలంబించిన విధానాలు ఇప్పుడు అవలంబించడానికి వీలులేదు. పాత విధానాలు అవలంబించడంవల్ల కార్మికులకు ఆపత్తులు కూడా రాగలవు. ఇప్పుడు మన వ్యవహారాలు మనం నిర్వహించుకోవడానికి అధికారం వచ్చింది. త్వరలో మన రాజ్యాంగ నిర్మాణం కూడా పూర్తి కాబోతున్నది. యీ రాజ్యాంగ నిర్మాణంలో జమీందారీ తత్త్వము మొదలైన పాత వ్యవస్థలన్నీ నశించి, సామాన్య పౌరులకు స్వాతంత్ర్యం యెక్కువగా లభించబోతున్నది. ప్రజలలో అత్యధిక సంఖ్యాకులైన కార్మికులకు కూడా ఈ తరుణంలో ఎక్కువ అధికారం లభించబోతున్నది.

మనకు దేశవిభజనవల్ల అనేకమైన విఘాతాలు ఏర్పడ్డాయి. ఈ ఆపత్తులన్నీ దాటి సిరపడాలంటే మనం చెమటఓడ్చి, కష్టపడవలసి ఉంటుంది. అయితే ఈ రెండేళ్లలోను భారత ప్రభుత్వం కార్మికుల పరిస్థితులేమీ బాగు చెయ్యలేదని ఒక విమర్శ వచ్చింది. అయితే భారత ప్రభుత్వం కార్మికుల పరిస్థితులు బాగుచెయ్యాలని అనుకుంటూనే వున్నది. అనేక కారణాలవల్ల భారత ప్రభుత్వం అనుకున్న ప్రణాళికలు అమలులో పెట్టలేక పోయింది. దేశంలో వస్తువుల ధరలు పెరిగిపోయాయి. కాని వస్తూత్పత్తి ఏమీ పెరగలేదు. వస్తూత్పత్తి పెరిగితేనేగాని కార్మికుల జీతాలు పెంచడానికి సాధ్యపడదు. యీ విషయం కార్మికులు బాగా గుర్తించాలి.

యంత్రాలు మొదలయిన వాటివల్ల జీతాలు ఎక్కువ చేసే పరిస్థితులు యేర్పడవు. ఈ విషయంలో మహాత్మా గాంధీ చెప్పిన మహోపదేశం మనం జ్ఞాపకం ఉంచుకోవాలి. ఆయన హింసవల్ల కలిగిన ఫలితాలు త్వరలోనే నశించిపోగలవని హెచ్చరించారు.

భారత ప్రభుత్వం పారిశ్రామికులకు కార్మికులకు మధ్య శాంతి వాతావరణం ఏర్పాటు చెయ్యాలని చూస్తున్న మాట నిజమే. అయితే అందరికీ సమానంగా న్యాయం కలగాలనే భారత ప్రభుత్వం ఆలోచిస్తున్నది. ఈ విషయంలో ఏమీ పక్షపాతం లేకుండా ముందుకు సాగిపోవాలని చూస్తున్నాము. కార్మికుల పరిస్థితులు అభివృద్ధి పరచడానికి భారత ప్రభుత్వం ఎన్నో కార్యక్రమాలు అమలులో పెట్టింది."

ఆ పిమ్మట జగజీవనరామ్ ఇంకా మాట్లాడుతూ, స్వాతంత్ర్యం వచ్చినంత మాత్రాన కార్మికుల పని ముగిసిపోలేదనీ, జనసామాన్యంలో కార్మికులే ఎక్కువగా ఉండడం వల్ల వారు గ్రామసీమలో సంపాదించ... [continues]

చుకున్న స్వాతంత్ర్యం జాగ్రత్తగా కాపాడుకోవాలనీ, స్వాతంత్ర్యమే పోతే కార్మికుల కందరికీ చాలా నష్టం వస్తుందనీ, అందుచేత నే విధ్వంసక చర్యలకు తాము పూర్తిగా విముఖులుగా ఉన్నామనీ చెప్పారు.

ఆయన ఇంకా ఇలాగ అన్నారు "మనం దేశంలో ఇంకా అధికారము, ధనము ఉన్నవారికే ఎక్కువగా గౌరవిస్తున్నాము. కాని కాయకష్టంతో పనిచేసే వారికే సంఘంలో ఎక్కువ గౌరవం ఇవ్వాలి. దురదృష్టవశాత్తు దేశంలో కార్మికులలో రెండు సంఘాలు ఏర్పడ్డాయి. ఒక సంఘం కార్మికుల యోగక్షేమాలకోసమే పాటు బడుతున్నది. మరి ఒక సంఘం రాజకీయాలకోసం కార్మికులను దోచుకోడానికే ప్రయత్నిస్తున్నది: కార్మికులు ఈ విషయం గమనించి తమ వ్యవహారాలు తామే చక్కబెట్టుకోవాలి."

కార్మికుల అభివృద్ధికి విశ్వవిద్యాలయాలు చెయ్యవలసిన దానినిగురించి మాట్లాడుతూ జగ్జీవన్‌రామ్ ఇంకా ఇలాగ అన్నారు. "కార్మికుల విషయంలో విశ్వవిద్యాలయాలు, విద్యార్థులు బాగా తోడ్పడాలి. ఈ మధ్యన విశ్వవిద్యాలయాలు కార్మికుల సమస్యలలో శ్రద్ధ వహిస్తున్నందుకు చాలా సంతోషంగా ఉన్నది. కొన్ని విశ్వవిద్యాలయాలు కార్మిక విషయాలమీద డిప్లొమాలు కూడా ఇస్తున్నాయి. అయితే కట్టికాగితం డిగ్రీలవల్ల వచ్చే ప్రయోజనం ఏమీలేదు. విద్యార్థులు కొంత కాయకష్టం చెయ్యడానికి కూడా సిద్ధపడితే కార్మికుల సమస్యలు ఇంకా బాగా అవగాహన చేసుకోగలుగుతారని నా నమ్మకం. అందుచేత విశ్వవిద్యాలయాలు విద్యార్థులు కొంత కాయకష్టం పనికూడా చెయ్యాలని విధిస్తే చాలా మంచిదని నా అభిప్రాయము. దీనివల్ల విద్యార్థులకు కార్మికుల గృహజీవితము తో సంబంధిన సమస్యలు అవగాహన చేసుకోడానికి వీలవుతుంది. దీనివల్ల కార్మికులకు విద్యార్థులకు పరస్పరము అవగాహన చేసుకోడానికి తగిన పరిస్థితులు ఏర్పడి, దేశంలో సరియైన ప్రజాస్వామ్యం స్థాపించడానికి వీలవుతుంది. ఇదే మన నూత్న రాజ్యాంగం పరమాశయము"

## ఈజిప్టులో సైనికశాసనం

### రద్దు చేయకుండుటకు ప్రభుత్వ నిర్ణయం

కైరో, నవంబరు 20: ఈజిప్టులో సైనిక శాసనాన్ని రద్దుపరచకుండా ఉంచుటకు, ఈజిప్టు ప్రభుత్వం నిర్ణయించింది. ఈరాత్రి మంత్రివర్గం రెండుమారులు సమావేశమై చర్చజరిపిన పర్యవసానంగా యీ నిర్ణయం జరిగింది. 1948 మే నెలలో, యిస్రాయిల్‌తో యుద్ధం సంభవించే సమయంలో, యీ సైనికశాసనం అమలు జరుపబడింది. ఆతరువాత మరొక సంవత్సరంవరకూ పొడిగింపబడింది. సైనికశాసనం క్రింద దాదాపు 500 మంది నిర్బంధములో ఉంచబడినారు. వీరిలో, అనేకమంది పత్రికా రచయితలు, నాయకులు, మొదలైన వారున్నారు.

## జపాన్ శాంతి ఒడంబడిక సమావేశానికి ప్రతినిధులు:

### ప్రకటన

టోకియో, నవంబరు 17: జపాను శాంతి ఒడంబడిక నిమిత్తం జరిగే సమావేశానికి తన ప్రభుత్వమే ప్రతినిధులను పంపుతుందని జపాను ప్రధాని యోషిదా సభ్యులు పార్లమెంటుకు తెలియ జేశారు.

# గుడివాడ, కైకలూరు తాలూకాలలో నష్టం

## అనధికార వర్గాలఅంచనాలు

### కొల్లేరు గ్రామాల ప్రజానీకం అవస్థలు

(స్వకీయ విలేఖరి)

మచిలీపట్నం, నవంబరు 20: కృష్ణాజిల్లా గుడివాడ, కైకలూరు తాలూకాలలో ఇటీవలి తుపాను, వరదలవలన నష్టం ఈ దిగువవిధంగా ఉన్నట్లు బాధ్యతగల అనధికారవర్గాలు వేసే అంచనాలవల్ల తెలుస్తున్నది.

గుడివాడ పట్నంలోను, తాలూకాలోను 15 వేల ఇళ్లు పడిపోయాయి. వీటి విలువ 160 వేలుంటుంది. 3200 పశువులు చచ్చిపోయాయి. వీటివిలువ 195 వేలు ఉంటుంది. 109 మంది మనుష్యులు చనిపోయారు. 62 వేల ఎకరాల మాగాణి చాలా దెబ్బ తిన్నది. 21 వేల టన్నుల ధాన్యం నష్టమైంది. ఇది కాక 600 ఎకరాల చెరకు, 100 ఎకరాల పసుపు 200 ఎకరాల మిరపపంటలు ధ్వంసమైనవి. కొందరు ధాన్యం 86 వేల టన్నులవరకూ నష్టమైందంటున్నారు.

'ఆంధ్రపత్రిక విలేఖరి' పర్యటనలో గుడివాడ తాలూకా కాంగ్రెస్ అధ్యక్షుడు ఈడుపుగంటి లింగయ్య, పోలవరపు నాగేశ్వరరావు, మారెడ్డి రామదాసు, అనుకు మిల్లి సుబ్బారావుగార్లను కలుసుకొని సంభాషించగా, ముదినేపల్లి ఫిర్కాలో పోలరాజు కాలవ, నందివాడ ఫిర్కాలో బుడమేరు వరదలవల్ల పసనష్టం విపరీతంగా ఉన్నదన్నారు.

కైకలూరు తాలూకాలో 22,650 ఇళ్లు పోయాయి. వీటివిలువ 2889 వేలుంటుంది. 4800 పశువులుచచ్చిపోయాయి. వీటిఖరీదు 4 లక్షలుంటుంది. గొర్రెలు మేకలు 4 వేలు పోయాయి. 185 మంది మనుష్యులు చనిపోయారు. ధాన్యం గిడ్డంగులు, గొడ్ల సావిళ్ళు 9925 పోయాయి. 90 వేల ఎకరాలు వరిపైరు నీటమునిగిపోయి 25 వేల టన్నుల ధాన్యం నష్టమైంది. తాలూకా కాంగ్రెస్ ప్రత్యేకోద్యోగి రాజనాల సుబ్బారావు, కోడూరు రమణయ్య, ఇంకోట్ల వెంకట్రామయ్యగార్లు ఈ అంచనాలు వేశారు. కాని ధాన్యం నష్టం 558 వేల టన్నులు టుందన్నారు.

మండవల్లి కిరూర్పున గలకొన్ని గ్రామాలలో ఇంకా పైరు నీటిలోమునిగేవున్నది.

కొల్లేరు సరస్సులోని కొవ్వాడ, చింతపాడు, పులపర్రు, పిల్లిపాడు, దయ్యపాడు, మానుగనూరు, నాదుమల్లి, పెనుమళ్ళ, నందిగామ, ఇగిలిపాక, మూడుతాళ్ళపాడు, పత్తిపాడు, తక్కెళ్ళపాడు, కొల్లేటికోట, కొత్తూరు, పంచికటమర్రు గ్రామాలు ఇంకా జలమయమయ్యే వున్నాయి. ఈ గ్రామాల ప్రజ మంచలు కట్టుకొని వాటిపైన వుంటున్నారు.

గన్నవరం తాలూకా పెదఅవుటపల్లి ఫిర్కా బుడమేరు వరదలల్లో చాలా నష్టపడింది.

## బ్రిటిష్‌వారికి సింహళ పౌరసత్వహక్కులు

### సవరణలద్వారా సంక్రమించే సూచన

కొలంబో, నవంబరు 20: బ్రిటన్, బ్రిటిష్ కాలనీలు వీటి ప్రజలకుగూడా సింహళంలో పౌరసత్వం లభించేవిధంగా సింహళపౌరసత్వ సూత్రాలను మారుస్తారని తెలుస్తున్నది.

ఈ మార్పు చేసినట్లయితే, బ్రిటిషువారుగాని, బ్రిటిషుకలన రాజ్యాల్లోనివారుగాని కనుక ఇష్టమైతే, సిలోనులో పౌరసత్వాన్ని సంపాదించి అక్కడే ఉండిపోవచ్చును.

అధికారయుతంగా ఇప్పుడు సిలోను పౌరసత్వచట్టం బ్రిటిష్ నేషనాలిటీ చట్టానికి కొంతవిరుద్ధంగాఉన్నది. అందువల్ల ఆ పౌరసత్వాలను మార్పుచేసే ప్రయత్నంలో అధికారులు ఇప్పుడు న్యాయవాదుల సలహాను తీసుకుంటున్నారు.

## రిజిస్ట్రేషన్ ఉద్యోగులు

కొలంబో, నవంబరు 17: సిలోనుపౌరులుగా రిజిస్టరు చేయించు కుంటున్న వాళ్లు ఎక్కువగా వస్తున్నారు గానుక రిజిస్టరు చేసే ఉద్యోగుల సంఖ్యను పెంచాలని ప్రభుత్వం ఆలోచిస్తున్నది.

ఇప్పుడు ఇట్లా రిజిస్టరు చేయించుకుంటున్న వాళ్లు ఎక్కువమంది ఇండియనులు, పాకిస్తానీలు అని రిజిస్ట్రేషన్ కమిషనర్ శ్రీ వి. ఎస్. విరసింహా అన్నారు. ఎట్లా లేదన్నా వారానికి 43 వొప్పున రిజిస్టరు చేయించుకుంటున్నారని ఆయన చెప్పారు.

# 'అఖిలభారత సంస్కృత విశ్వవిద్యాలయం ఏర్పడాలి'

## బొంబాయి భారతీయ విద్యాభవన ప్రధానాచార్యుడు దీక్షితార్ సూచనలు

ఆగ్రా, నవంబర్ 20: సంస్కృత విద్యాబోధనమును సమన్వయము చేయుటకును, కేంద్రీకరించుటకును అ. భా. సంస్కృత విశ్వవిద్యాలయమునొకదానిని స్థాపింప కృషిచేయవలెనని ఆచార్య టి. వి. ఆర్. దీక్షితార్, బొంబాయి భారతీయ విద్యాభవన ప్రధానాచార్యులు అ. భా. సంస్కృత సమ్మేళన తృతీయ సమావేశములో ఉపన్యసించుచు కోరిరి.

సంస్కృత భాషను, విజ్ఞానమును పునరుద్ధరించుట అత్యవసరమని దీక్షితర్ చెప్పుచు సంస్కృతము అగాధమును, పరిపూర్ణమును, గంభీరమును అగు భారత విజ్ఞాన సంపదకును, నాగరికతకును మూలకందమనిరి. ఈ మూలమునుండి యావత్ప్రపంచము ఆధ్యాత్మిక ముగాను, నైతికముగాను పరిపుష్టినొంది యుండగా భారతీయులు తమకు అత్యంతము అనుభవనీయమగు పిత్రార్జితము విషయమై యించుక యు ఎరుగని వారివలె నున్నారని ఆచార్యులు చెప్పిరి. పరిపాలనా విషయములో యిప్పుడు ఆంగ్ల భాషకుగల ప్రతిపత్తి సంస్కృతమునకుగూడలభ్యము కాగలదనిరి. సంస్కృతమును నేర్చుకొనుటలో గల కష్టమును గోరంతలు కొండంతలు చేయుచున్నారని ఆయన చెప్పుచూ బోధనా పద్ధతులను మార్చి ఈ కష్టమును తగ్గించవచ్చుననిరి.

సంస్కృతము 'మృతభాష' యైనదను ప్రకటనల విషయమై ఆచార్యులు ప్రస్తావించుచు అది యిప్పుడు ప్రజల వాడుక భాషగాలేదని, వైజ్ఞానులు పండితులు మాత్రమే దానిని ఉపయోగించుచున్నారని చెప్పిరి. అశోకునికాలమునను, గుప్తచక్రవర్తుల కాలమునను సంస్కృతభాషకు లభించిన దోహదమేయిందుకు కారణమని, అప్పుడు సంస్కృతము మహోన్నతస్థితి యందుండెనని, దానిని జనసామాన్యము నకు యివ్వకుండిరనిరి. సంస్కృత విజ్ఞాన సంప్రదాయము ప్రజల నరములలో జీర్ణించినట్లు శ్రీమద్రామాయణముయొక్క ప్రజలకు యింకనుగల ఆదరభావము స్పష్టము చేయుచున్నదని దీక్షితర్ చెప్పుచు యిట్టి సందర్భమున ప్రభుత్వప్రోత్సాహమే యున్నయెడల సంస్కృతభాషను పునరుద్ధరించుట అసాధ్యమా యని యడిగిరి.

సంస్కృతభాషను పునరుద్ధరించుటకు వారు ఈ క్రిందిమార్గములు సూచించిరి. (1) శాసనసభలలో సంస్కృత పండితులకు తగిన ప్రాతినిధ్యము (2) సంస్కృత ప్రొఫెసర్లను యితర ప్రొఫెసర్లతో సమానముగా చూచుట (3) మద్రాసులో చేసినట్లు ఆస్థానకవులను నియమించుట (4) మహామహోపాధ్యాయ మున్నగు బిరుదులను యిచ్చుట ఇట్టివే యితర బిరుదులను ప్రకటించుట (5) ఉన్నత పాఠశాలలలో సంస్కృతమును నిర్బంధ భాషగా చేయుట.

# ఇంటిమీదకూలిన విమానం

## వైమానికుని మరణం

అలహాబాదు, నవంబరు 20: అలహాబాదులో ఒక విమానం ఎగురుతూవుండగా ఒకభవనానికి కొట్టుకొని పగిలిపోయింది.

ఇందుమూలంగా విమానం నడపడం నేర్చుతూవున్న ఫ్రాన్సిస్ డిసౌజా అనే ఆయన వెంటనే మరణించారు. విమానం నడపడం నేర్చుకుంటున్న ఎ. కె. బెనర్జీ అనే ఆయనకు మంచి గాయాలుతగిలాయి.

శ్రీ బెనర్జీని హాస్పిటల్‌లో చేర్చారు. గాని బ్రతుకుతాడనే ఆశ లేదని తెలుస్తున్నది.

# మదరాసు ధరలు

మదరాసు, నవంబరు 21:

బంగారు - వెండి నేటి మధ్యాహ్నం 1 గంటకు ధరలు 1-8 ఎడ్వర్డు బొమ్మ సేల్సుటాక్సుతోసహా రు. 77-0-0 పెళ్లి బంగారు తులం 115-0-0 మూసబంగారు 112-12-0 సీమవెండి తులం 100-8 (రెడీ) 170-0-0 వెండి తులం 1 8 1-12-0

వేరుసెనగ: (581 పా 1-8 ఎక్సు కోస్తాగిడ్డంగులు) మెషీన్ (సేల్సుటాక్సుతోసహా) బజారు కొత్తది. 158-0-0, 159-0-0 వేరుసెనగనూనె ఎక్సు పెల్లర్ (పీవరేజ) నవంబరు అండ్ డెలివరి రు. 338-0-0

8 టు 5% యస్. యస్. ఎ, కొబ్బరికాయలు (87 పొన్ను గల దళ్ళా) ఒకటికి రు. 37-0-9, కొచిన్ సిలోన్.

ఆముదం

కాండి 500 పౌనులుగలది రు 265-0-0

పంచదార

ప్యారీ (2 అంకరు) రు. 91-14-8


24-వ తేదిన విడుదల
కృష్ణవేణి
నాగయ్య
నారాయణరావు
స్టూడియో... శోభనాచల
డైరెక్టర్... ప్రసాద్.
BALU BROS
మనదేశం

| | | | | | |
|---|---|---|---|---|---|
| శ్రీ దుర్గకళామందిరం | — | బెజవాడ | సత్యనారాయణ | — | తెనాలి |
| మినర్వా | — | రాజమండ్రి | ముభారక్ | — | బళ్ళారి |
| మినర్వా | — | విశాఖపట్నం | క్రౌన్ | — | కాకినాడ |
| కేసరి | — | ఏలూరు | వినాయక్ | — | నెల్లూరు |
| స్వామిరాజ్ | — | భీమవరం | శ్రీ పరమేశ్వరీ | — | అనకాపల్లి |
| న్యూబాంబే | — | గుంటూరు | | | |

డిస్ట్రిబ్యూటర్లు:
ఆంధ్ర, సీడెడ్, నైజాం: రాజ్‌శ్రీ పిక్చర్సు లిమిటెడ్, విజయవాడ, గుంతకల్, సికింద్రాబాద్.
మైసూరు స్టేటు, కూర్గు, దక్షిణ కెనరా: యశోధర ఫిలిమ్సు కార్పొరేషన్ గాంధీనగర్, బెంగుళూరు సిటీ.
ఇతర వివరములకు:
ఎం. ఆర్. ఎ. ప్రొడక్షన్సు, మిాన్రాపూర్ హౌస్, మదరాసు-18.
చమ్రియా టాకీ డిస్ట్రిబ్యూటర్సు, 4, జనరల్ పాటర్సురోడ్డు, మదరాసు-2.

## నోటీసు

సూ. గో. జిల్లాజడ్జి కోర్టులో
O. P. 228/1949

పిటీషనరు: వైజర్సు వెంకటరావు సా॥ దోసకాయలపల్లి

రెస్పాండెంట్లు: 1 పసల శ్రీరాములు సా॥ బనాతుపురాడి, 2 నరకూరి సూర్యారావు సా॥ దోసకాయలపల్లి, 3 కొఠారి వీరన్న సా॥ దోసకాయలపల్లి, 4 యీ. సూర్యారావు సా॥ దోసకాయలపల్లి.

లేటు కొఠారి అచ్చమ్మ తాలూకు బంగారపు రెండు పట్టెడలు, అమ్మకము చేయించి, బాకీలు వసూలుచేసి సదరు సొమ్ములు సరిఅయిన పూచీకత్తుపై వడ్డీకి యిచ్చి వృద్ధిచేయుటకున్నూ ఆమె పిటీషనరు ట్రస్టీగా వుండి ఆమె పేరున దోసకాయలపల్లి గ్రామములో మంచినీళ్ల చలివేంద్ర నడుపవలసినదని ఏర్పాటు చేసినందున అందు విషయమయి కోర్టువారి ఉత్తరవులు పొందుటకు పిటీషనరు కోరుతూ పిటీషను దాఖలుచేసినందున అందుకు ఆక్షేపణలు తెలియచేయుటకు తేది 28-11-1949 సం॥ము ఉదయము పదిగంటలకు వాయిదా వేయబడినదని యిందుమూలముగా తెలియచేయడమైనది.

రాజమండ్రి, 11-11-49. సత్రి హనుమంతరావు, పిటీషనరు వకీలు.



## టెండరు నోటీసు

హైవేసు డిపార్టుమెంటు

సీలువేసిన టెండర్లు హైవేసు

చిత్తూరు డివిజనల్ యింజనీయరుగారిచేత వారి ఆఫీసునందు 5-12-49-వ తేది సాయంకాలము 4 గంటలవరకు పుంగనూరు మైసూరు ఫ్రాంటియరు రోడ్డులోని 4/8-వ మైలులో బ్రిడ్జి కట్టుటకుగాను సీల్డు టెండర్లు తీసుకొనబడును.

టెండరు వివరములు, నిర్ణీత ఫారములు, ప్లానులతో సహా పెట్యూల్సు హైవేసు డివిజనల్ యింజనీయరు వారి ఆఫీసులో 30-11-49 నుంచి 1-12-49-వ తేదివరకు పెంక్లు ఖర్చు వారి వల్ల రు 10-2-6 చెల్లించిన వారి కివ్వబడును. టెండరు ఫారముల క్రయము వాపసు యివ్వబడదు.

టెండరుతో కట్టవలసిన డిపాజిట్టు మొత్తము రు 1,100/-

డివిజనల్ యింజనీయరు (హైవేసు) చిత్తూరు.



## టెండరు నోటీసు

మచిలీపట్టణము మునిసిపాలిటి, మచిలీపట్టణము

ఎఫ్. అండ్ జి. గ్రూపులలోని కొన్ని రోడ్డు పనులను చేయుటకు నిర్ణీత ఫారములో సీలుచేసిన టెండర్లు 25-12-1949 తేదీ సాయంత్రము 4 గంటలవరకు, మునిసిపల్ ఆఫీసులో, కమీషనరుగారిచే గాని, వారు లేనప్పుడు, వారివల్ల అధికారము పొందిన వారిచేగాని తీసుకొనబడును. సదరు టెండర్లు ఆనాడె సాయంత్రము 4-15 గంటలకు తెరవబడును. ఒక్కొక గ్రూపుకు రు 4/-ల వంతున మునిసిపల్ ట్రెజరీలో చెల్లించి, మునిసిపల్ యింజనీరు (సివిల్) ఆఫీసునుండి, పనుల జాబితాయున్ను, టెండరు డాక్యుమెంట్లు యితర వివరములు పొందవచ్చును.

ఎస్. సుబ్బారావు నాయుడు, కమీషనరు 16-11-1949.



## విూ జాతకఫలం ఉచితం

ఏదైనా పుష్పం పేరు, మీరు వ్రాసే వేళ, మాకు తెలిపితే చాలు. మీ 12 మాసాల ఫలితాలు ఉచితంగా పంపుతాము. జాతకంలో మాకుగల ప్రావీణ్యం చూపటానికే పరీక్షగా యీ సౌకర్యం 2 నెలలు మాత్రమే యివ్వబడుతుంది.

Shri Kali Ashram, P.B. 199, Delhi.



ఆయిల్ యింజన్లు

RUSTON

విక్రేతలు:
ఇండో లంక బ్రదర్సు,
38, లింగిచెట్టి వీధి, మద్రాసు-1.
గ్రాము "Indolanka" ఫోను: 1152

ADS


# ఫ్రాన్సుకు లెబనాన్ హెచ్చరిక

## "బాకీపడిన సొమ్మును తక్షణం చెల్లించాలి"

బైరూట్, నవంబరు 19: లోగడ జరిగిన ఫ్రెంచి లెబనాన్ ఆర్థిక ఒడంబడికను పట్టి తాను ఇవ్వవలసియున్న కోటిన్నర లెబనాను పౌన్లనూ తక్షణం చెల్లించవలసినదని నేడు లెబనాన్ ప్రభుత్వం ఫ్రాన్సును కోరినది.

లెబనాన్ పౌనుకు 97.8 ఫ్రాంకుల రేటునూ, ఒక బ్రిటిష్ పౌనుకు 883 లెబనాన్ పియాస్టర్ల రేటునూ, అమెరికన్ డాలరుకు 220 పియాస్టర్ల రేటునూ నిలబెడతానని ఫ్రెంచిప్రభుత్వం ఆ ఒడంబడికలో వాగ్దానంచేసి ఉన్నది.

# ఇండొనీషియా అధ్యక్షునికి భారత గవర్నరు జనరలు అభినందన

న్యూఢిల్లీ, నవంబరు 19: హేగ్ రౌండు టేబిలు సమావేశం జయప్రదంగా ముగిసినందుకు అభినందిస్తూ ఇండియా గవర్నరు జనరలు శ్రీ సి. రాజగోపాలాచారి డా॥ సుకర్నోకు టెలిగ్రాం పంపారు. దానిని కృతజ్ఞతతో స్వీకరిస్తూ డా॥ సుకర్నో జవాబిచ్చారు.

# బ్రహ్మాండమైన అటం బాంబు?

వాషింగ్టను, నవంబరు 18: ఈ వేళ సెనెటరు ఎడ్విన్, సి. జాన్సను ఇక్కడ మాట్లాడుతూ, ఈ మధ్యన బ్రిటను అమెరికాను నాగసాకిలో వేసిన అటంబాంబు కన్న 6 రెట్లు ఎక్కువశక్తి కలిగిన అటంబాంబునుగురించిన వివరాలు తెలియజేయవలసిందని అడిగినట్లుగా చెప్పారు.

సెనెటరు జాన్సను పరమాణుశక్తి సంఘంలో సభ్యులు. ఈయన ఈ మధ్యన జరిగిన అమెరికా ఇంగ్లాండు కెనడాల సంప్రతింపులలో బ్రిటను అమెరికాకు తన అభ్యర్థిని పంపిందని చెప్పారు.

ఇక్కడి అధికారులు సెనెటరు జాన్సను ప్రకటనపై వ్యాఖ్యానం చెయ్యడానికి నిరాకరించారు.

# పోలండులోని ఫ్రెంచి అసిస్టెంటు కాన్సలుపై గూఢచర్యల ఆరోపణ

వార్సా, నవంబరు 19: పోలండులోని స్టెటిన్ (రేవు) నగరంలో ఫ్రెంచి అసిస్టెంటు కాన్సలుగా ఉన్న ఆంద్రీ సైమన్ రోబినో (వయస్సు 25) వార్సానుండి నిన్న విమానంలో పారిపోవు బయలుదేరనుండగా పోలండు అధికారుల చేత అరెస్టు చేయబడ్డాడు. ఈ విషయాన్ని నేటిరాత్రి వార్సారేడియో ప్రకటిస్తూ, తాను రహస్య చర్యలు చేసినమాట నిజమని రోబినో ఒప్పుకొన్నట్టు కూడా తెలిపింది.

అనుకొన్న విధంగా రోబినో విమానంలో పారిపోలేక పోవడంతో ఫ్రెంచి అధికారులు ఆందోళన పడి అన్వేషణలు సాగించారు.

వార్సాలో ని ఫ్రెంచి రాయబారికి పోలండు విదేశాంగశాఖవారు రోబినో అరెస్టు వార్త తెలుపుతూ, ఆయన భద్రతా నిబంధనలను ఉల్లంఘించినట్లు చెప్పారు. పోలండు వారు రాజకీయ మర్యాదను ఉల్లంఘించారని ఫ్రెంచి రాయబారి ఆక్షేపించాడు.

వార్సాలోని ఫ్రెంచి రాయబార కేంద్రంలో దుబాసిగా (తర్జుమా దారు) పనిచేసే ఫెర్నాండ్ రనాడ్ అనే ఫ్రెంచి వాణ్ణి కేటి ఉదయం సెక్యూరిటీ పోలీసులు నిర్బంధంలో వుంచి సోదాచేసి ప్రశ్నించి అనంతరం వదలి వేశారు.

వార్సా విమానకేంద్రంనుండి రెండు నెలలకాలంలో ఇద్దరు ఆకస్మికంగా అదృశ్యులైనారు. రెండవవాడు రోబినో, మొదటివాడు. సోర్టన్‌ఫీల్డు అనే అమెరికావాడు. ఇతడు లండనుమీదుగా అమెరికాకు పోయూ సెప్టెంబరుమాసంలో ఈ విమాన కేంద్రంలోనే అదృశ్యుడైనాడు. అతడేమైనాడ ఇంతవరకు తెలియదు.

రోబినోతోపాటు బ్రెస్లాలోని ఫ్రెంచి కాన్సలేటులోని మరొక ఫ్రెంచి అధికారికూడా పోలండులో విచారించబడతాడనీ, గూఢచర్యలలో పాల్గొంటున్న ఫెర్నాండు రనాడ్, మరొక ఫ్రెంచి వాడున్నూ పోలండునుండి పంపబడతాడనీ వార్సారేడియో తెలిపింది.

## మద్రాస్ విశ్వవిద్యాలయ సెనేటుకు ఎన్నిక

కర్నూలు, నవంబరు 18: కర్నూలు జిల్లాబోర్డు తరపు మద్రాసు విశ్వవిద్యాలయసెనేటుకు శ్రీయుత నూకా రామిరెడ్డి గారు (దివిపల్లె, పత్తికొండ) యేకగ్రీవంగా ఎన్నికైనారని జిల్లాబోర్డు కాంగ్రెసుసంఘము వారు ఏకగ్రీవముగా నిలబెట్టినారని జిల్లాబోర్డు కాంగ్రెసు పార్టీ సభ్యులకు సూచించి యుండిరి. స్వ. వి.

# గుంటూరు జిల్లాలో కాంగ్రెసు ఎన్నికలు

## అ. భా. కాంగ్రెస్ తాఖీదు

తెనాలి, నవంబరు 19: గుంటూరు పశ్చిమ గోదావరి జిల్లాలలో తాలూకా, పట్టణ కాంగ్రెసు సంఘముల ఎన్నికలు జిల్లా కాంగ్రెస్ సంఘములే జరుపవలెనని అఖిల భారత కాంగ్రెస్ సంఘం తాఖీదు పంపింది.

ఈ ఎన్నికలను రాష్ట్ర సంఘమువారే స్వయముగా జరుపుటకు నిశ్చయించినారనీ, మిగిలిన జిల్లాలలో మామూలు పద్ధతి ప్రకారం జిల్లా సంఘములే జరుపుటకు ఏర్పాట్లు గావించిరనీ ఈ రెండు జిల్లాల వారూ అ. భా. కాంగ్రెసు సంఘం వారికి అప్పీలు జేసుకొన్నందున వారి తాఖీదు పంపిరి. రాష్ట్ర కాంగ్రెస్ వారి పద్ధతి సరిగా లేదని కూడా అందు తెలిపిరి. (స్వ. వి.)

# బాలగంగాధర తిలక్ పుస్తకాలయం

పెదపులివర్రు, నవంబరు 18: 14-11-49 వ తేదీన పెదపులివర్రు గ్రంథాలయ భవనమందు శ్రీ ఆవుల గోపాలకృష్ణమూర్తి యమ్. ఏ. ఎల్. ఎల్. బి గారి అధ్యక్షతక్రింద శ్రీ బాలగంగాధరతిలక్ పుస్తకాలయ 28వ వార్షికోత్సవము జయప్రదముగ జరిగెను.

అధ్యక్షునికి సన్మానపత్రము సమర్పింపబడెను.

సన్మాన పత్రమునకు సమాధానముగ గ్రంథాలయ పురోభివృద్ధికి అవసరమైన సలహాలొసగుచు అధ్యక్షుడు ఉపన్యాసము చేసిరి.

సభను శ్రీ జటావల్లభుల పురుషోత్తం యమ్. ఎ. లెక్చరర్, యస్. ఆర్. ఆర్ కాలేజి విజయవాడ గారు ప్రారంభించిరి.

శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మ, వడ్లమూడి వెంకటరత్నము, గోపదేవు, పరుచూరి వెంకయ్య చౌదరిగార్లు ఉపన్యసించిరి.

ఎల్లరిని అభినందించుచు అధ్యక్షులు అంత్యమున మహోపన్యాసము చేసిరి.

15-11-49వ తేదీన ఫిడేలు విద్వాన్ దాసరి వెంకటేశ్వర్లు, మృదంగ శిరోమణి కోదాడ అమృతలింగముగార్ల సహాయముతో ఉప్పలపాటి లక్ష్మీనారాయణగారు పాటకచ్చేరి చేసిరి.

తెల్లాకుల వెంకటేశ్వర్లు గుప్త భాగవతారుగారు మాయా సుభద్రయను హరికథాకాలక్షేపముచేసిరి.

అభినందనములతో ఉత్సవం ముగింపబడెను.

# కొత్తరకపు డీజెల్ బస్సు

మద్రాసు, నవంబరు 19: బెంగుళూరులోని హిందుస్థాన్ ఏర్‌క్రాఫ్టు ఫ్యాక్టరీ వారు కూర్చిన "ఆల్-మెటల్" సెడాన్ డీజెల్ బస్ తొలిసారిగా నిన్న మద్రాసు మంత్రులకు, పత్రికా ప్రతినిధులకు ప్రదర్శింపబడింది. ప్రధాని శ్రీ కుమారస్వామి రాజా, ట్రాన్స్‌పోర్టు శాఖామంత్రి శ్రీ బెజవాడ గోపాలరెడ్డి, రెవిన్యూశాఖా మంత్రి శ్రీ హెచ్. సీతారామరెడ్డిగార్లనూ కొందరు పత్రికాప్రతినిధులనూ ఆ బస్సులో ఎక్కించి మెరీనా వెంటా, కొన్ని నగరవీధులవెంటా కంపెనీవారు తిప్పి ఆ బస్సు ఒసగగల ప్రయాణసౌకర్యాలను ప్రదర్శించారు.

హిందుస్థాన్ ఏర్‌క్రాఫ్టు ఫ్యాక్టరీ జనరల్ మేనేజరుగారైన శ్రీ సేన్ గుప్తా అతిథులను ఆహ్వానిస్తూ ఆ బస్సుయొక్క ప్రత్యేక సదుపాయాలను వివరించారు. దీనిని తమ ఫ్యాక్టరీలో కూర్చడంవల్ల దిగుమతి చేయబడిన బస్సులకంటె దీనివెల తక్కువగా వుంటుందని వారు తెల్పారు.

31 మంది ప్రయాణికులు హాయిగా కూర్చొనేందుకు ఈబస్సులో స్థలమున్నది. బస్ ఆకారం చాలా ఆకర్షవంతంగావుంది. దీని బాడీ పూర్తిగా ఉక్కుతో తయారు చేయబడినది. పై సెల్సు అల్యూమినియంతో చేయబడినవి. ఇందువల్ల అగ్నిప్రమాదపు భయములేదు. పగుల్పయిన కిటికీలకు ట్రిప్లెక్స్ అద్దములు అమర్చబడినవి.

ఈ బస్సు ఒకగాలను డీజెలు ఆయిలునకు 18 మైళ్లు నడుస్తుంది. దీని వెల సుమారు రూ. 35,000.

అతిథులను నగరవీధులలో త్రిప్పేటప్పుడు మిస్టర్ కె. వాన్స్‌లే యీ బస్సును నడిపారు. దీనికి అయిదు గియర్లు కలవనిన్నీ, అట్లుండుటవల్ల ఎత్తు ఇరుకురోడ్లమీదకూడా సునాయాసంగా నడపడానికి వీలు కలదని ఆయన తెల్పారు. పెట్రోలు వెలకంటె డీజెల్ ఆయిల్ వెల తక్కువ కాబట్టి దీనినివాడటంవల్ల బస్సు ఒకటికి సాలీనా అయిదు వేల రూపాయలు ఆదా చెయ్యవచ్చునని మిస్టర్ వాన్స్‌లే అన్నారు.

ప్రదర్శనానంతరం అతిథులకు "వుడ్ లాండ్స్" హోటల్‌లో తేనీటి విందు చేయబడింది.

# ఆచార్య రంగా జన్మదినోత్సవం

## గవర్నరు జనరలు సందేశం

### నగర సభలో ప్రముఖుల ప్రశంసలు

మదరాసు, నవంబరు 20:— ఆచార్య రంగాదేశమునకుచేసిన ముఖ్యముగా రైతు కూలీప్రజాలోకమునకు చేసిన సేవను ఆదివారంవారి జన్మదినోత్సవ సందర్భమున ఆంధ్రకేసరి స్థానకాంగ్రెసుయాజమాన్యమున జరిగిన సభలో ఉగ్గడించిరి. లెజిస్లేటివు కవున్సిల్ అధ్యక్షుడు శ్రీ ఆర్. బి. రామకృష్ణం రాజుగారు అధ్యక్షత వహించిరి. సంఘ అధ్యక్షుడు శ్రీ కె. బెంజిమన్ సభికులకు స్వాగత మిచ్చిరి.

గవర్నరు జనరలు శ్రీ రాజగోపాలాచారిగారు వీరారు ఆయనను ముదుసలి చేయవలెనని ఎంత ప్రయత్నించినను నా సుభాశీస్సులవలన ఆచార్య రంగా యువకుడుగానే యుండుగాక" యని సందేశము పంపిరి.

శ్రీ రామకృష్ణంరాజు గారు మాట్లాడుచు ఆచార్య రంగాగారు రైతుల స్థితిని చక్కబరచుటకు చేసిన సేవ నుదహరించుచూ, పేద కార్మిక తరగతుల జీవన పరిస్థితులను తెలుసుకొనుటకు ప్రపంచ యాత్ర చేశారనిరి. కాంగ్రెసు ప్రభుత్వమును బలపరచుట కార్మికుల విధియనియు, కష్టపరిస్థితులలో అందరూ ఏకగ్రీవముగా నడచి కుపాను బాధితుల నివారణకు ప్రభుత్వముతో సహకరించవలెననిరి.

ఆచార్య రంగాగారు ముప్పది సంవత్సరములుగా రైతుల సేవ చేయుచున్నారనియు, వారికృషివల్లనే ఆంధ్రరాష్ట్రము ఏర్పడినదని శ్రీ రామకృష్ణంరాజుగారనిరి. నగరములోని ఆంధ్రులకు ఎట్టి కష్టము కలుగనీయమని తమిళులు హామీ ఇచ్చియున్నారనికూడ వారనిరి.

శ్రీ ఆర్. వెంకటరెడ్డి యం. యల్. ఎ., వి. వి. రామయ్యశాస్త్రి, కె. దేవసహాయం, కె. బెంజిమన్, యన్. జాన్ డాక్టరు కె. వి. స్వామి ఇస్నా వెంకట్రామయ్య చెట్టిగార్లు ఉపన్యసించినతరువాత శ్రీరామకృష్ణంరాజుగారు జాతీయగీతములుపాడిన శ్రీమతి సురియమ్మకు రజితపాత్రను బహూకరించిరి. గేయరచయిత శ్రీ కే. యన్. బోస్, శ్రీ బెంజిమన్ గారు అభినందనలు తెలిపిరి.

# 'ఆత్మహత్యా న్యాయ సమ్మతం కావాలి'

## కామత్‌గారి బిల్లు

న్యూఢిల్లీ, నవంబరు 19: ఆత్మహత్యా ప్రయత్నమును న్యాయసమ్మతము చేయగోరు బిల్లు నొకదానిని భారత శాసన సభలో ప్రతిపాదింప సి. పి. బేరార్ సభ్యుడు శ్రీ ఎచ్. వి. కామత్ గారు నోటీసిచ్చియున్నారు. దేశ ప్రభుత్వము మానవునికి అతని వ్యక్తిరక్షణకు మధ్య అడ్డుగా నుండరాదని బిల్లు కారణములు, ఉద్దేశ్యములలో ఆయన వివరించుచున్నాడు.

## కీ. శే. జనాబ్ అబ్దుల్ సతార్‌గారు

విజయవాడ, నవంబరు 18: స్థానిక మ్యునిసిపల్ కౌన్సిలరు జనాబ్ అబ్దుల్ సతార్‌గారు మొన్న 42 వ ఏట ఆయన స్వగృహంలో దివంగతులైనారు. గత నెల మాసముల నుంచి సుస్తీతో యీయన బాధపడుతున్నారు. డా॥ టి. వి. యస్. చలపతి రావు, చైర్మను, ఇతర మ్యునిసిపల్ కౌన్సిలర్లు, మ్యునిసిపల్ సిబ్బంది దహన సంస్కారములకు హాజరయ్యారు. మొన్న కౌన్సిలు సమావేశమయి, అబ్దుల్ సతార్ జ్ఞాపకార్థం సానుభూతి తీర్మానాన్ని అంగీకరించిన పిదప వాయిదా వేయబడింది. అన్ని మ్యునిసిపల్ సంస్థలు నవంబరు 25 వ తేదీన మూసి వేయడానికి నిర్ణయించారు. (స్వ. వి.)

# కాంగ్రెసు కార్యవర్గ తీర్మానము

## తమిళ సరిహద్దు సంఘ హర్షం

మదరాసు, నవంబరు 20: తమిళనాడు సరిహద్దు సంఘకార్యవర్గము శనివారం సమావేశమై ఆంధ్రరాష్ట్ర నిర్మాణము సందర్భమున కాంగ్రెసు కార్యవర్గమువారి నిర్ణయమును అభినందించుచూ తీర్మానించెను.

దక్షిణ భారత ప్రజలలో శాంతి సామరస్యవృద్ధికై ఆంధ్రరాష్ట్ర రాజధానిని తాత్కాలికముగాకూడ మదరాసులో వుంచుట క్షేమంగాదని తీర్మానంలో తెలిపిరి. మదరాసు, ఆంధ్రరాష్ట్రముల సరిహద్దులకు సంబంధించిన భోగట్టా సేకరించుటకు ఒక ఉపసంఘమును నియమించిరి.

# రేడియో ప్రోగ్రాములు

నవంబరు 23 బుధవారం

## మద్రాసు (ఎ)

ఉ. 7-30 వి. విశ్వనాథం వీణ. 8 ఆంగ్లమున వార్తలు. 8-15 ఉదయ సంగీతం (రి.) 8-30 మద్రాసు (బి) వలె. మ. 1-30 ఆంగ్లమున వార్తలు. 1-40 సినిమాసంగీతం (రి.) 4-30 పాశ్చాత్య సంగీతం (రి.) సా. 5-30 బి. దయానిధి సితార్. 6 ఆంగ్లమున వార్తలు. 6-20 ప్రేమా దొరైస్వామి పాట. 7 వి. కె. శంకరనారాయణరావు వీణ. 7-30 సి. కల్పకం, సి. శ్యామల, పాట. 8 మద్రాసు (బి) వలె. 8-30 టి. కె. రామస్వామి పాట. 9 ఆంగ్లమునవార్తలు. 9-15 కాఫీ ఉత్పత్తి మార్కెటింగ్, ఆంగ్లమున ప్రసంగం. 9-30 మద్రాస్ (బి) వలె. 10 గాత్ర సంగీతరికార్డులు.

## మద్రాసు (బి)

ఉ. 7 తెలుగున వార్తలు. 7-15 సెమ్మంగుడి శ్రీనివాసయ్యర్ రికార్డులు. 7-45 మద్రాసు (ఎ) వలె. 8-30 కౌసల్య పాట. మ. 12 కార్మికుల కార్యక్రమం. 12-30 మాధ్యమిక పాఠశాలా విద్యార్థులకు యుద్ధములు, ముట్టడులు, ప్రొఫెసర్ ప్రసంగం. వి. సుశీలాదేవి వ్యాయామ పాఠాలు నిర్వహణ. సి. సత్యనందం పాఠశాల దినచర్య. 1-30 మద్రాసు (ఎ) వలె. 1-50 తెలుగునవార్తలు. 2-15 ఉన్నత పాఠశాలా విద్యార్థులకు. ఏందుకు ఏలాగ మెరుపు తళతళ మెరయును ప్రసంగం, ఐ. భాష్యం అయ్యంగార్ చూడబోవుట, తేయాకు సుభ్రపరచుప్యాక్టరీ. రూపకం. 4-0 ప్రాథమికపాఠశాలా విద్యార్థులకు కవులు రచనలు. రాయప్రోలు సుబ్బారావు ప్రసంగం. దేవులపల్లి కృష్ణశాస్త్రి ధ్రువుడునాటిక. సంగీతపాఠాలు. సా॥ 5-30 మద్రాసు (ఎ) వలె. 6-20 సాయం సంగీతం (రి). 6-30 గ్రామస్థుల కార్యక్రమం. పసువర్ధకశాఖ. బతుకుజబ్బునివారణ. ప్రసంగం. ఏలియేలో యేలేలా, జానపదగీతం, విశేషాలు ప్రకటనలు ధరలు వాతావరణవివరాలు. 7-0 తెలుగున వార్తలు. 7-15 రామదాసు భజనావళి. 8-0 'రామచిలుక' చరిత్రాత్మకరూపకం. రచన జలసూత్రం రుక్మిణీనాథశాస్త్రి. 8-30 మదరాసు (ఎ) వలె. 9-30 ఆర్. శివప్రకాశం వేణువు. 10-0 మదరాసు (ఎ) వలె.

## విజయవాడ

ఉ॥ 7-0 తెలుగునవార్తలు. 7-15 డి. కె. పట్టమ్మాళ్ రికార్డులు. 7-30 మోతే వేదకుమారి పాట. 8-0 ఆంగ్లమున వార్తలు 8-15 గీతావళి. జి. శ్రీనివాసమూర్తి. 8-30 బుర్ర పాటి సీతామహాలక్ష్మి. వయొలిన్. మ. 12-30 మాధ్యమిక పాఠశాల విద్యార్థులకు 1. తారాపథం (రి) 1-30 ఆంగ్లమున వార్తలు. 1-50 తెలుగునవార్తలు. 2-15 ఉన్నత పాఠశాలావిద్యార్థులకు 4. ప్రాథమిక పాఠశాలా విద్యార్థులకు సా. 5-30 బుర్రపాటి సీతామహాలక్ష్మి వయొలిన్ 6. ఆంగ్లమున వార్తలు. 6-20 గీతావళి. జి. శ్రీనివాసమూర్తి. 6-30 గ్రామస్థుల కార్యక్రమం (మద్రాసునుండి) 7. తెలుగునవార్తలు. 7-30 చిత్రవాణి (రి) 7-45 కాలచక్రము. అంతర్జాతీయవార్తాసమీక్ష. జి.వి. సుబ్బారావు 8. ఖండవిల్లి జనార్దనా చార్యులు వీణ. 8-30 మోతే వేదకుమారి పాట. 9. ఆంగ్లమునవార్తలు. 9-15 మద్రాసువలె. 9-30 ఖండవిల్లి జనార్దనా చార్యులు. వీణ

## హైద్రాబాదు

ఉ. 7-30 దార్రా. రికార్డులు. 7-40 శకుంతలాబాయ్. ఖయాల్ తోడి. 8. ఆంగ్లమునవార్తలు. (ఎ. ఐ. ఆర్. రిలే). 8-20 ఎం. వెంకటరాజు. కర్నాటక సంగీతం. 8-50 తెలుగునవార్తలు. 9-15 అజీజ్ అహమ్మద్ ఖాన్. దార్రా. ఘజల్. మ. 12 30 రికార్డులు. 1. పి. భానుమతి రికార్డులు 1-30 ఆంగ్లమునవార్తలు. 1-50 తెలుగున వార్తలు (ఎ. ఐ. ఆర్. రిలే) సా 5 శకుంతలాబాయ్ ఖయాల్ ఫిల్మ్‌సాంగ్ 6-15 అజీజ్ అహమ్మద్ ఖాన్ తుమ్రీ 5-30 శ్రీకృష్ణన్, సితార్ 5-40 శకుంతలాబాయ్ దార్రా 6-30 గ్రామస్థుల కార్యక్రమం తెలుగున మంచి ఆహారం (రి) బాలెన్సుడు ఆహారం డాక్టరుగారి ప్రసంగం గీతావళి ఎం. వెంకట్రాజు సూక్తిముక్తావళి 7 తెలుగున వార్తలు (ఎ. ఐ. ఆర్. రిలే) 7-15 జంత్రవాద్యమేళనం గీతావళి. ఎం. వెంకట్రాజు వినోదాలు. 7-45 హైదరాబాదు రాష్ట్రంలో గ్రామపంచాయతి ఎన్నికలు ఎన్నికల కమిషనరు ఎస్. రాజేశ్వర్ ఆంగ్లమున ప్రసంగం 7-55 అజీజ్ అహమ్మద్ ఖాన్ గీత్ 9-30 శకుంతలాబాయ్ ఖయాల్ మారు బెహాగ్ 8-45 అజీజ్ అహమ్మద్ ఖాన్ దార్రా ఘజల్ ధ్వజక్ 9 ఆంగ్లమునవార్తలు (ఎ. ఐ. ఆర్. రిలే) 9-15 శ్రీకృష్ణన్ సితార్ 9-30 శకుంతలాబాయ్ ఘజల్ భజన్ 9-55 శ్రోతలు కోరిన రికార్డులు 11 ముగింపు.


వింకోలా
పరిశుద్ధమైన టానిక్ విటమిన్ "బి" లో
SPW PRODUCT
స్టాండర్డు ఫార్మస్యూటికల్ వర్క్సు లిమిటెడ్.
సోల్ డిస్ట్రిబ్యూటర్సు:
స్టాండర్డు ప్రాడక్ట్సు లిమిటెడ్, "కార్నర్ ఎస్టేటు"
70, ఎ్యుటి, సెంబుదాస్ వీధి, మద్రాసు 1.

ఈనోస్ "ఫ్రూట్ సాల్ట్" నిత్యపు పనులను ఉత్సాహముతో చేయునట్లు మీకు సహాయపడుతుంది.

మీ జీర్ణకోశము విషపదార్థముల మాలిన్యముతో నిండియుంటే మీకే ఉత్సాహముగా ఉండదు, మీరు సరిగా పని చేయలేరు. ... ఈనోస్ "ఫ్రూట్ సాల్ట్"...

ఈనోస్ "ఫ్రూట్ సాల్ట్" మంచి ఆరోగ్యమునకు
ఈనో మరియు "ఫ్రూట్ సాల్ట్" అను మాటలు రిజిష్టరు చేయబడిన ట్రేడ్ మార్కులు.

వాటిని మిఠాయి దుకాణాలు స్టోర్లలో అడగండి.
పీక్ ఫ్రీన్ బిస్కట్లు
SWEET ASSORTED ★ GOLDEN PUFF ★ GLAXO BISCUITS
PEEK FREAN'S
BISCUITS
ఏజెంట్లు: ప్యారీ అండ్ కంపెనీ లిమిటెడ్., మద్రాసు 1.

కేసరి త్రిరత్నాలు
★ ★ ★
లోధ్ర
గర్భాశయ రోగ నివారిణి
స్త్రీల వ్యాధులన్నింటికి, హిస్టీరియా, శిరస్సునొప్పులు, నిద్ర లేకపోవడం, అజీర్ణం, మలబద్ధకం, దగ్గు, ఉబ్బసం, తలనొప్పి, నడుంనొప్పి మున్నగువాటికి శ్రీరామ రక్ష.
★
అమృత
రక్తాన్ని పరిశుభ్ర పరచగల దివ్యౌషధం
పాండువ్యాధి, అజీర్తి, మలబద్ధకం, బ్రెయిన్-ఫాగ్, అశక్తత, చెమట, జ్ఞాపకశక్తి విహీనత, మందబుద్ధి చర్మరోగాలకు ఇద్దే పనిచేస్తుంది.
★
అర్క
జ్వరరోగ నివారిణి
ఇన్‌ఫ్లుయెంజా, టైఫాయిడ్, మలేరియా మున్నగు అన్ని రకముల జ్వరములకు దివ్యౌషధం. స్ప్లీన్, లివర్ వ్యాధులకు కూడా శ్రీరామ రక్ష.
★ ★ ★
కేటలాగు కొరకు వ్రాయండి
కేసరి కుటీరం లిమిటెడ్
రాయపేట : : మద్రాసు 14.

LEPROSY & LEUCODERMA
Acute or chronic - partial or all over the body, treated successfully by our safe world-wide reputed herbal home treatment in four weeks. Particulars on request. Please Correspond in English.
KAMALA WORKS, (A. P.)
Panchpota, Bengal.

ది యునైటెడ్ కమర్షియల్ బాంక్ లిమిటెడ్.
బాంకింగ్ వసతులన్నియు ఇవ్వబడును.
అధికార మూలధనము రూ॥ 4 కోట్లు
వసూలైన మూలధనము రూ॥ 2 కోట్లు
రిజర్వు నిధి రూ॥ 45 లక్షలు
హెడ్ ఆఫీసు. కలకత్తా.
జి. డి. బిర్లా, చేర్మన్. బి. టి. ఠాకూర్, జనరల్ మేనేజరు.

# ఇతర వస్తువుల ధరలు తగ్గక రైతులు పండించే ధాన్యం ధరను తగ్గించరాదు

## సంయుక్తరాష్ట్ర రైతుసంఘ వార్షికసభలో ఆచార్య రంగాగారి అభిభాషణ

లక్నో, నవంబరు 19: ప్రొఫెసర్ యన్. జి. రంగాగారి అధ్యక్షతన యీవేళ యిక్కడ జరిగిన, సంయుక్త రాష్ట్ర కిసాన్ యూనియన్ ప్రథమ వార్షికమహాసభను ప్రారంభోత్సవం చేస్తూ భారత ప్రభుత్వ ఆహారశాఖామంత్రి జయరాందాస్ దౌలత్‌రాంగారు ఇలా ప్రసంగించారు:

'భారతదేశపు ఆర్థికస్థితి స్థాయికి రావాలంటే, జనము, ప్రత్తి, నూనెగింజలూ, ఆహారధాన్యాలూ, వీటి ఉత్పత్తులను ఒక క్రమపద్ధతిని పెంపొందించితీరాలి. ఎకరాకు మనం పండించుచున్న పంట ఇతర దేశాలతో పోల్చి చూసుకుంటే సగానికి సగంకూడా లేదు ఎక్కువ ఎకరాలను సాగుకు తేవటంతోపాటు, ఎక్కువ ఫలసాయం వచ్చేటట్లుగాకూడా ప్రయత్నించాలి.

ఈ కార్యక్రమం నిర్విఘ్నంగా జరగాలంటే, ఇలాంటి అనధికార సంస్థలు రైతులకు నవీన వ్యవసాయక పద్ధతులలో ఉత్సాహాన్ని కలిగించాలి.

'ప్రజల జీవనోపాధులు గరిష్ఠ ప్రమాణానికి తేవాలన్నా, మన పరిశ్రమలకు ముడిపదార్థాలు విరివిగా లభించాలన్నా, విదేశ చెలామణీలను సంపాదించుకోవాలన్నా వ్యవసాయకోత్పత్తులు పెరగాలి. గ్రామీణప్రాంతాల నవీన జీవితావకాశాలన్నిటినీ పెంపొందించుకోవాలంటే ఉత్పత్తులను అధికంగాచేసుకుని డబ్బు సంపాదించుకోవాలి.

'దేశసంపదను పెంపొందించటానికి ఈ అనధికార సంఘాలు ఎంతో పనిచేయటానికి సావకాశంవున్నది. ఈ సంస్థలు ఏ రాజకీయ పార్టీలతోనూ ముడిపెట్టుకోకుండా కేవలం వ్యవసాయాభివృద్ధికే పనిచెయ్యాలి' అన్నారు. ఆచార్యరంగా తమఅధ్యక్షోపన్యాసంలో ఇలాఅన్నారు:

'వ్యవసాయకోత్పత్తుల ధరలు తగ్గాలనే వాదానికి నేను పూర్తిగా వ్యతిరేకిని. తక్కినవస్తువు లన్నిటిధరలూ తగ్గకుండా రైతులు ఉత్పత్తి చేసే ఆహారాదులకు మాత్రమే ధరలుతగ్గించితే రైతు దెబ్బతింటాడు. రైతు జీవనప్రమాణం ఇప్పటికే చాలా కనిష్టంగావున్నది. నగరవాసులు చేస్తున్న యీ ప్రచారాన్ని పురస్కరించుకుని రైతుమీద వత్తిడితెస్తే, అధికాహారోత్పత్తి కార్యక్రమం దెబ్బతింటుంది. వ్యవసాయ రంగంలోకి నవీనపద్ధతులను ప్రవేశపెట్టాలి. ఇతరదేశాలలో సహకారోద్యమంద్వారా రైతు యాంత్రిక సహాయాన్ని పెంపొందించుకోగలిగారు. భారతదేశపు రైతుకూడా వారిని అనుకరించి అభివృద్ధికి రావాలి' అన్నారు.

### కాన్పూరుకు 20 వేల కిసానుల యాత్ర

కాన్పూరు, నవంబరు 19: ఈ జిల్లాలోని సోషలిస్టులంతా రాబోయే కిసాను యాత్రకు కావలసిన సన్నాహాలన్నీ చేస్తున్నారు. ఈ యాత్ర నవంబరు 25 వ తేదీని జరుగుతుంది. జమీందారీ రద్దుకోసం కాన్పూరు జిల్లాలో కిసానులందరిదగ్గర 10 రెట్లు ఎక్కువ శిస్తు వసూలుచేస్తున్నారట. ఈ చర్యకు తమ అసమ్మతి తెలియచేయటానికీ, జమీందారులకు నష్టపరిహారం ఇవ్వకుండా జమీందారీలను రద్దుపరచటానికీ, జిల్లా సోషలిస్టులచే ఈ యాత్ర ఏర్పాటు చెయ్యబడుతున్నదని తెలుస్తున్నది. ఆయా ప్రాంతాలలోని 20 వేల కిసానులు నవంబరు 21 వ తేదీకి కాన్పూరు చేరుకుంటారు. వీరందరూ కాలినడకమీద 25 వ తేదీకి లక్నో చేరుకుంటారు. వీరు లక్నో వచ్చిన తరువాత ఊరేగింపుగా వెళ్ళి ప్రభుత్వానికి తమ అసమ్మతి తెలియచేయగలరని తెలుస్తున్నది.

### శ్రీ యం. ఏ. చిదంబరం చెట్టియార్ గారికి విందు

చెన్నపట్నం, నవంబరు 20: విదేశములలో పర్యటనచేసి తిరిగివచ్చిన శ్రీ యం. ఏ. చిదంబరంచెట్టియార్ (దక్షిణ వాణిజ్య సంఘ ఉపాధ్యక్షుడు) గారిగౌరవార్థం ప్రముఖ వ్యాపారస్థుల అతిథి సత్కారమును నిన్న సాయంత్రంకన్నిమారా హోటల్‌లో విందు ఏర్పాటుచేసిరి. న్యాయమూర్తులు, ప్రముఖులు అనేకమంది విందుకు విచ్చేసియుండిరి. అతిథులందరూ యిష్టాగోష్ఠిగా ఒక గంటసేపు విందారగించిన మీదట ప్రధాన అతిథికి దక్షిణ ఇండియా వాణిజ్య సంఘాధ్యక్షుడు పుష్పమాల వేసి గౌరవించిరి.

## జిల్లా వెల్ఫేర్ అధికారుల నియామకం

### హరిజనులకే కాక వెనుకబడిన జాతులకుకూడా సౌకర్యాలు

ఏలూరు, నవంబరు 19: వివిధ జిల్లాలలో ఇదివరకు జిల్లా హరిజన వెల్‌ఫేర్ అధికార్లుగా పనిచేస్తున్న వారిహోదా అభివృద్ధిచేస్తూ, వారి విధులలో మార్పులు గావిస్తూ ప్రభుత్వంవారి క్రింది ఉత్తర్వులు జారీచేశారు.

రాష్ట్రంలో అన్ని జిల్లాలలోనూ ఇదివరకు జిల్లా హరిజన వెల్‌ఫేర్ అధికార్లు పనిచేస్తూ యున్నారు. వీరందరూ ఇంతవరకూ, అర్హతగల జాతుల (హరిజనులు, ఆ అంతస్తునకు చెంది ప్రభుత్వమువారి ప్రత్యేక సౌకర్యములు పొందుచున్న జాతులు) క్షేమ కార్యక్రమమే నిర్వర్తిస్తున్నారు. ఇక ముందునుండీ వీరికి, వెనుకపడ్డ జాతుల క్షేమ కార్యక్రమముకూడ వప్పగింపబడును. వీరి పేరుకూడా జిల్లా వెల్‌ఫేర్ అధికారులని మార్చబడును.

ప్రస్తుతం మద్రాస్, నీలగిరి జిల్లాలలో తప్ప మిగతా 23 జిల్లాలలో జిల్లా హరిజన్ వెల్‌ఫేర్ అధికార్లున్నారు. వీరందరూ డిప్యూటీ తహసీలుదారు హోదాకు చెందినవారై యున్నారు. ఇకముందునుండీ ఈ క్రింది జిల్లాలలో తప్ప, మిగతా 15 జిల్లాలలోనూ, ఈ పదవికి, తహసీలుదారు హోదాకు చెందిన, అనుభవశాలురైన ఉద్యోగస్తులను నియమించవలసినదిగాను, మిగిలిన 8 జిల్లాలైన తూర్పు గోదావరి, కృష్ణా, గుంటూరు, చెంగల్పట్టు, తంజావూరు, రామనాథం, తిరునల్వేలి, మలబార్ జిల్లాలలో, ఇందుకు సంబంధించిన కార్యక్రమము ఎక్కువగా ఉన్నది. కాబట్టి ఆ జిల్లాలలో ఈ పదవికి డిప్యూటీ కలెక్టరు హోదా గలవారిని నియమించుటకును, ప్రభుత్వం నిశ్చయించింది. ఈ 8 జిల్లాలలో జిల్లా వెల్‌ఫేర్ అధికార్లు కలెక్టరుకు పర్సనల్ అసిస్టెంట్లుగానూ, మిగతా జిల్లాలలో ఇదివరకులో వలెనే కలెక్టరుకు లోబడినీ పనిచేయుదురు. ఈ నియామకములు ప్రస్తుతం మార్చి 31, 1950 వరకూ చేయబడినవి.

డైరెక్టర్ ఆఫ్ హరిజన్ వెల్‌ఫేర్‌కు సహాయకారిగా నుండుటకు మరొక డిప్యూటీ డైరెక్టర్ ఆఫ్ హరిజన్ వెల్‌ఫేర్ పదవి సృష్టింపబడినది. ఇదివరకు డైరెక్టర్ యొక్క పర్సనల్ అసిస్టెంటు పదవి కూడా డిప్యూటీ డైరెక్టరుపదవికి మార్చబడినది. స్వ. వి.

# పశ్చిమ గోదావరి జిల్లా కాంగ్రెస్ వ్యవహారాలు

## ఉత్తరాల బట్వాడాపై పేచీ

### రంగాగారికి ప్రత్యేకోద్యోగి నివేదన

ఏలూరు నవంబరు 19: పశ్చిమ గోదావరి జిల్లా కాంగ్రెసు స్పెషల్ ఆఫీసర్‌గా నియమింపబడిన శ్రీ. శివమూర్తిగారు, జిల్లా కాంగ్రెసు కార్యాలయముచార్జీతీసికొనుటకు నిన్న యిచటకు వచ్చారు.

వారిని స్పెషల్ ఆఫీసరుగా నియమించిన వెంటనే, రాష్ట్ర కాంగ్రెసువారు జిల్లాకాంగ్రెసు టపా యావత్తూ అల్లూరి సత్యనారాయణరాజు ప్రభృతులకు యివ్వరాదనీ శివమూర్తిగారికే యివ్వవలెననీ పోస్టలు ఉద్యోగులకు వ్రాసియున్నారు. వారాప్రకారమిచ్చిన టపా తీసికొనుటకు పోస్టాఫీసునకు వెళ్ళగా, పోస్టలు అధికారులు, తమకు నడింపల్లి తిరుపతిరాజుగారు, జిల్లా కాంగ్రెసు కార్యదర్శి హోదాతో, రాష్ట్ర కాంగ్రెసువారు తమ్ము సస్పెండ్ చేయుచూ యిచ్చిన ఉత్తర్వులపై తాము అప్పీలు చేసితిమనీ, ఆ అప్పీలు తేలేవరకూ టపా ఎవ్వరికీ యివ్వరాదని, తెలియపర్చిరనీ, ఈవిధంగా టపా విషయము తగాదాలో పడుటచే తాము తగాదా తేలేవరకూ టపా ఎవ్వరికీ యివ్వజాలమనీ తెలిపిరని తెలియవచ్చింది.

ఈ మధ్యాహ్నము శివమూర్తిగారు అల్లూరి సత్యనారాయణరాజుగార్ని కలుసుకొని జిల్లా కాంగ్రెసు కార్యాలయము చార్జీ వప్పగింత పెట్టవలసినదిగా కోరరనీ, వారు, తమసస్పెన్షను విషయంలో రాష్ట్రపతి నిలుపుదల ఉత్తరువుయిచ్చినట్లు తమకు రూఢిగా తెలిసినదనీ, ఈ విషయం ఇవ్వమిద్దరుని ఈ వేళో రేపో తేలిపోవుననితలంచుచుంటిమనీ, అంతవరకూ శివమూర్తిగారు వేచియుండవలసినదని కోరిరని తెలిసింది. దానిపై శివమూర్తిగారు ఈవిషయములను రాష్ట్రకాంగ్రెసు అధ్యక్షులు రంగాగార్కి తెలియపర్చి ఈ సాయంకాలం వెళ్ళిపోయినారని తెలిసింది. (స్వ. వి.)

### కీ. శే. ముళ్ళపూడి సత్యనారాయణ బ్రహ్మ

నూజివీడు, నవంబరు 18: నూజివీడు కాంగ్రెసు ప్రముఖనాయకులు శ్రీ ముళ్ళపూడి సత్యనారాయణబ్రహ్మగారు స్థానిక ఆస్పత్రిలో పదిరోజులనుండియు టైఫాయిడ్ జ్వరముతో బాధపడుచు గతరాత్రి పరమపదించిరని తెలుపుటకు మిక్కిలి విచారపడుచున్నది.

### కీ॥ శే॥ మాదేటి సన్యాసయ్యగారు

రాజమండ్రి, నవంబరు 19: చిరకాలమునుండి అనేకగ్రంథములు ప్రచురించుట ద్వారా భాషాసేవచేసిన మాదేటి సన్యాసయ్యగారు తమ 80వ ఏట నిన్న పరమపదించిరి. వీరి మరణమునకు సంతాపసూచకముగ పుస్తకములషాపులు నిన్న మూసివేయబడెను. (స్వ. వి.)

# ఎగుమతి సుంకాల మార్పు

## ప్రభుత్వ ప్రకటన

న్యూఢిల్లీ, నవంబరు 19: 1949 నవంబరు 18 నుంచి భారతప్రభుత్వంవారు పత్తిమీద ఎగుమతి సుంకం బేలుకు రు 40 ల నుంచి రు 100 లకు పెంచారు; మిరియాలపై నూటికి 30 వంతులు కిమ్మతు వారీ పన్ను విధించారు; ఖరీదైన సిగిరెట్లమీద పన్ను నూటికి 15 నుండి 7 న్నరకు దించారు.

### ప్రకటన పాఠం

ప్రభుత్వవాణిజ్య శాఖవారీ ప్రకటన చేశారు:

"1949 ఎగుమతి సుంకాల ఆర్డినెన్సు క్రింద తమకుగల అధికారాలను పురస్కరించుకొనినీ, ఇండియాలోనూ ఇతర దేశాలలోనూ ఈ సరకులకున్న ధరల వ్యత్యాసాలను పురస్కరించుకొనినీ ప్రభుత్వంవారు ఎగుమతి సుంకాలను పై విధంగా మార్చడమైనది. పత్తికొరత ఉన్నది కనుక పత్తిని డాలరుప్రాంతాలకు తప్ప ఎగుమతి చేయరాదు.

"1000 కి రు 35 లు పై బడ్డ టోకు ధరగల సిగిరెట్లమీది ఎగుమతి సుంకం నూటికి 15 నుండి 7 న్నరకు తగ్గించబడింది. ఇది ఆస్ట్రేలియాకు అధికంగా ఎగుమతి కాగలవు."

## స్పెషలు సెకండు క్లాసు

### డిసెంబర్ 1వ తేదీనఅమలు

బొంబాయి, నవంబరు 19: రేపుడిసెంబరు 1 వ తేదీనుంచి రైల్వేలలో స్పెషల్ సెకండుక్లాసు అమలులోకి వస్తుందని తెలుస్తోంది. ఇది ముఖ్యమైన మెయిళ్ళలోను, ఎక్స్‌ప్రెస్సులలోను, పాసెంజరులలోను ప్రవేశపెడతారు. ఇందులో పూర్వము సెకండుక్లాసులలోని సౌకర్యాలన్నీ ఉంటాయి. ఇందులో మైలుకు 14 పైసల చొప్పున చార్జీ వసూలుచేస్తారని తెలుస్తున్నది. ఇప్పుడు సెకండుక్లాసులలో ప్రత్యేక రుసుములమీద నిద్రసౌకర్యం కలిగించే పద్ధతికూడా ఇంకముందునించి తొలగిస్తారని తెలుస్తున్నది.

## చంద్రనగరులో అరెస్టులు

చంద్రనగరు, నవంబరు 19: గతవారంలో ఇక్కడి నారమిల్లు ముందు టపాకాయ పేలిన సందర్భంలో ఇక్కడి పోలీసులు ఒకస్త్రీని అరెస్టుచేశారు. ఈమె రాజకీయ వాదిగా భావించబడుతున్నది.

స్థానిక ఫార్వర్డు బ్లాకుకు చెందిన కార్యదర్శిని మరి నలుగురు సభ్యులను మరొక సందర్భంలో పోలీసులు అరెస్టుచేశారు. నవంబరు 18 న జయప్రకాశ్‌నారాయణ ఉపన్యసించే బహిరంగసభవద్ద వీరు ప్రదర్శనాలుచేశారట. ఈ ప్రదర్శనాల అనంతరం సభలో రెండు వర్గాలవారికి పోట్లాట జరిగి ఆరుగురు గాయపడ్డారు. వారిలో ముగ్గురు పోలీసులు.

## హస్సార్‌లోని పశువులను గురించి తూర్పు, పశ్చిమ పంజాబుల వివాద

లాహోరు, నవంబరు 19: పశ్చిమ పంజాబు గవర్నరు సర్దార్ అబ్దుర్ రాబ్ నిష్టార్ అధ్యక్షతకింద తూర్పు, పశ్చిమ పంజాబ్ ప్రతినిధుల సమావేశం నేడుకూడా సాగి అనేక తాత్కాలిక నిర్ణయాలు జరిగినట్లు తెలుస్తున్నది

హస్సార్ పశుకేంద్రంలోని పశువుల పంపకం సమస్యమాత్రం ఇంకా తేలలేదు. ఇందులో సుమారు లక్షన్నర రూపాయల విలువగల పశువులు పశ్చిమపంజాబుకు చెందవలసి ఉన్నవట. దేశ విభజన అయిన నాటినుండి హస్సార్ పశువుల మేత ఖర్చులకింద 10 లక్షల రూపాయలు వ్యయమయిందనీ, మేత ఖర్చులిస్తే ప. పంజాబు వారు తమ వంతు పశువులను తీసుకొనవచ్చుననీ తూ. పంజాబు ప్రతినిధులన్నారు.

మేత ఖర్చులు చాలా ఎక్కువచేసి చూపబడినవనీ, గత రెండు సంవత్సరాల లోనూ హస్సార్ పశుకేంద్రం చేసిన ఖర్చులు పరీక్షించి, వాటిని ఉభయ రాష్ట్రాలూ పంచుకొనడం భావ్యమనీ ప. పంజాబువారన్నారు.

ఈ పశుకేంద్రం చాలా లాభాలు పొందుతూ ఉండవచ్చును కనుక పై సూచనకు ఒప్పుకుని తూ. పంజాబువారన్నారు.

ఉభయప్రభుత్వాల ఆర్థికశాఖల కార్యదర్శులు పశుకేంద్రాన్ని సందర్శించి, లెక్కలు తనిఖీ చేసి, ఉభయపక్షాలకూ ఆమోదకరంగా ఉండేటట్లు మేతఖర్చులు అంచనా కట్టాలని కొనకు నిర్ణయం జరిగింది.

# "మెట్రిక్ కొలమానాలను బలపరచాలి"

## ప్రమాణ నిర్ణయ సంఘంవారి సిఫార్సులు

న్యూఢిల్లీ, నవంబరు 19: మెట్రిక్ కొలమానములను అమలు జరుపవలెననే అభిప్రాయాన్ని దేశంలో చాలామందికి వున్నట్లు, ప్రమాణ నిర్ణయసంఘంవారిని వేదిక తెలియ జేస్తున్నది.

డాక్టర్ జె. సి. ఘోష్‌గారి అధ్వర్యం క్రింద నిరుటి సంవత్సరం యేర్పాటుచేయబడిన ఈ సంఘంవారు, క్రమేపీ దశాంశ పద్ధతిని, కరెన్సీనికూడా అమలుజరపాలని సిఫారసు చేస్తున్నారు. ఈలోగా పాఠశాలలో తూనికలు కొలతలు వగైరా అన్నిటిలోనూ, యీ దశాంశ విజ్ఞానమును పూర్తిగా వ్యాపింప జేయాలి. క్రమేపీ మెట్రిక్ తూనికలూ, కొలతలూ ప్రవేశపెట్టాలి.

ఈ విషయంలో సరియైన భోగట్టా తీయటానికి, ఈ సంఘం వారు దేశంలో వివిధ రాష్ట్ర ప్రభుత్వాలనుంచీ, పారిశ్రామిక సంస్థలనుంచి అభిప్రాయాలు సేకరించారు. దేశంలో ఈమార్పు తీసుకురావటానికి చాలాడబ్బు వ్యయం మాతుంది. అందుచేత ఈ మార్పును 10లేక 15 సంవత్సరాల అవధిని నెమ్మదిగా అమల్లోకి తేవాలని సూచించారు మొదటి అయిదు సంవత్సరాలలో ప్రకటనలలోనూ, సాంకేతిక విద్యా కేంద్రాలలోనూ ఈదశాంశ పద్ధతుల విజ్ఞానాన్ని పూర్తిగా వ్యాపింపజేయాలి" అని సిఫారసు చేశారు.

## బ్రిటిష్ రైలు ఇంజన్ పారిశ్రామికుల రాక

బొంబాయి, నవంబర్ 19: బ్రిటన్ నుంచి, రైలుఇంజన్లు తయారు చేసే యంత్ర పరిశ్రమల నాలుగు ప్రతినిధులు 4 గురు యీవేళ బొంబాయి చేరారు. వీరు రేపటిదినం ఢిల్లీ వెడతారు. ఈ పారిశ్రామిక ప్రతినిధివర్గానికి, 'బ్రిటిష్‌లోకమోటివ్ మాన్యుఫాక్చరర్ అసోసియేషన్' డైరెక్టరూ న్యాయశాస్త్ర సలహాదారూ అయిన జె. డి. బోవెన్‌గారు నాయకత్వం వహించుచున్నారు.

వీరు భారతదేశానికి సాంకేతిక విద్యానిపుణులను పంపించే విషయంలో, ఇండియన్ రైల్వే బోర్డుతో సంప్రదించటానికి వచ్చారు. చిత్తరంజన్‌లోకమోటివ్ కేంద్రాన్ని ఆజమాయిషీ కనుక్కోవటానికీ, భారతీయ విద్యార్థులకు శిక్షణ నివ్వటానికీ అవసరమైన సాంకేతిక ప్రవీణులను పంపే విషయమై వీరు రైల్వే బోర్డుతో సంప్రదించుతారు.

## గవర్నరుజనరలు సంతాపం

కలకత్తా, నవంబరు 19: భారతగవర్నర్ జనరలు శ్రీ సి. రాజగోపాలాచారి, ఇటీవల కలకత్తాలో విమానాలు ఢీకొనడంవల్ల జరిగిన ప్రమాద ఫలితంగా ఒక వైమానికుడున్నూ, అనేకమంది ఇతరులున్నూ, పిల్లలున్నూ చనిపోయినందుకు సంతాపం తెలుపుతూ ప. బెంగాలు గవర్నరుకు సందేశం పంపారు.

# హైదరాబాద్ సంస్థానానికి మిలిటరీ గవర్నరు జె. యన్. చౌదరి సేవ

## నాయకులప్రశంస: వెల్లోడి నియామకానికిహర్షం

హైదరాబాద్, నవంబరు 19: "మేజర్ జనరల్ చౌదరీగారు హైదరాబాద్‌కొనర్చిన సేవలు అపారం. ప్రజల హృదయాలలో యివి కలకాలం హత్తుకొనిపోయి ఉంచగలవు" అని హైదరాబాద్ సంస్థాన కాంగ్రెసు అధ్యక్షులు స్వామి రామానంద తీర్థగారు ఒక ఇంటర్వ్యూలో అన్నారు. చౌదరీగారు ఒక్క హైదరాబాద్‌నే కాకుండా, జాతి సర్వనాశనం కాకుండా దేశం యావత్తును రక్షించారన్నారు. అరాచకం, కల్లోలం నుండి సంస్థానాన్ని రక్షించి శాంతిని ప్రతిష్ఠింపగలిగారు.

మిలిటరీ గవర్నరుస్థానే సంస్థాన పరిపాలనాధికారిగా వెల్లోడీగారు నియమించబడటం, ప్రజాస్వామికంవైపు పురోగమించటమన్నారు. హైదరాబాద్‌లో జరుగనున్న అతిప్రధానమైన, ఉత్తమోత్తమమైన మార్పులకు యిది నాందివంటిదన్నారు. వెల్లోడీగారు పరిపాలనాధికారిగా విశేషానుభవం కలవారన్నారు. ఆయన సంస్థాన పరిపాలనాధికారిగా నియమించబడినందుకు హర్షం వెలిబుచ్చుతూ రామానంద తీర్థగారు, ఆయన హయాంలో హైదరాబాద్ సంపూర్ణ ప్రజాస్వామికంవైపు పురోగమించ గలదని విశ్వాసం వెలిబుచ్చారు.

"హైదరాబాద్, భారత సమాఖ్యలో చేరటం నిస్సందేహం. భారత రాజ్యాంగమే యిక్కడకూడ వర్తించగలదు. మనం దేశంలోని యితర ప్రాంతీయులతో అన్నివిధాలా కలిసిపోయినాము. మన బాధ్యతలు కూడ పెరిగినవి. అయితే హైదరాబాద్ ప్రజల కోర్కెను తీర్చటం ఒక్కటే మిగిలి ఉంది. దానిని సాధ్యమైనంతవరకు నెరవేర్చటానికి వీలు కలిగేటట్లుగా మనం పరిస్థితులను రూపొందించాలి" అని స్వామీజీ అన్నారు. రాజా బహదూర్ అరవముద అయ్యంగార్ యిట్లన్నారు.

"పరిస్థితులననుసరించి చౌదరీగారు తిరిగి రక్షణశాఖకు వెళ్లుతున్నప్పటికీ, ఆయన వెళ్ళిపోవటంతో హైదరాబాద్ ఒక సమర్థుడైన గవర్నరును పోగొట్టుకొంటున్న దనుటలో ఏమాత్రం అతిశయోక్తిలేదు. ఆయన యిక్కడవున్న 14 నెలల కాలంలో సంస్థానంలోని ప్రజలందరి ప్రేమ, సౌజన్యాలను చూరగొన్నారు. ఈయన వెళ్లిపోవటం హైదరాబాద్ ప్రజలకు అమిత దుఃఖకారణం కాగలదు. అయితే ఈయన స్థానంలో సంస్థాన పరిపాలనాధికారిగా పరిపాలనానుభవంగల, సమర్థుడైన వ్యక్తి నియమింపబడినారు. ఇది హైదరాబాద్ ప్రజలకు సంతృప్తి కలిగించగలదు.

బూర్గుల రామకృష్ణరావు గారిట్లన్నారు.

చౌధరీగారు తమ పరిపాలనా, నిర్వహణ చాకచక్యంతో హైదరాబాద్ ప్రజలప్రేమ సౌజన్యాలను చూరగొన్నారు.

ఆయన మిలిటరీ వాడైనప్పటికీ అంతకంటె మిక్కిలి గాసివిలియన్‌గా ఉన్నారు.

సైనికాధికారి అయినప్పటికీ అంతకంటే ఎక్కువగా రాజనీతి దురంధరుడు. హైదరాబాద్ ప్రజలు, ఆయనను తమ స్నేహితునిగాను, స్వాతంత్ర్య ప్రదాతగను కలకాలం జ్ఞాపకం ఉంచుకోగలరు. ఆయన తమ పరిపాలనాకాలంలో ప్రజల అభివృద్ధికి పునాదులు వేశారు."

మంజార్ అహమ్మద్‌ఖాన్‌గా రిట్లున్నారు.

చౌధరీగారి నిష్పక్షపాతం, న్యాయదృష్టి ప్రశంసా పాత్రమైనవి. అల్లకల్లోలంగా నున్న సంస్థానంలో కొద్ది కాలంలో ఆయన శాంతిభద్రతలు ప్రతిష్ఠించ గలిగారు. ఇది హిందువులలోను ముస్లింలలోను సంపూర్ణవిశ్వాసం కలిగించింది. శాంతికి భంగకరంగా ప్రవర్తించే వారెవరైనప్పటికీ ఏ మతానికి చెందినప్పటికీ, వారిమీద నిష్పక్షపాతంగా కఠినచర్య తీసుకున్నారు. నీనివల్ల సంస్థానంలో శాంతిభద్రతలు రక్షింపబడినవి".

## సంస్థానవర్గాల విచారం

హైదరాబాదు, నవంబరు 19: మేజర్ జనరల్ చౌధురి డిసెంబరు 1 న వెళ్లిపోతున్నారనేసరికి ఇక్కడ అందరూ విచారం వెలిబుచ్చుతున్నారు. పరిపాలకుడుగాను, వ్యక్తిగాను ఆయన చాల గొప్పవాడని వివిధరాజకీయ వర్గనాయకులు అంటున్నారు.

హైదరాబాదు ప్రజలకొక సందేశమిస్తూ మేజర్ జనరల్ చౌధురీ ఇలా అన్నారు.

"మీ హక్కులు నా చేతుల్లోను, నా సహోద్యోగుల చేతుల్లోను సురక్షితంగా వుంటాయని హామీ యిస్తున్నాను. ఈ వాగ్దానాన్ని నెరవేర్చటానికి మేము శక్తి వంచనలేక పనిచేశాము. కృతకృత్యులమయ్యామనే నా విశ్వాసం. ప్రస్తుత ప్రభుత్వము పేరులోతిప్ప ఎన్నడూ మిలిటరీ ప్రభుత్వంగా ప్రవర్తించలేదు. శాంతిభద్రతలను రక్షించుటానికి పనిచేసినప్పటికీ కూడా, మీ భద్రత, క్షేమము, అభ్యుదయములను ఒక్కక్షణమైనా విస్మరించలేదు మేము."

14 నెలలక్రిందట చౌధురి సికందరాబాదులో విజయోత్సవంతో అడుగుపెట్టిన నాటినుండి ఆయన పరిపాలన పరికించిన ప్రతివారికీ ఆయన తన వాగ్దానమును నెరవేర్చుకొన్నారనే స్పష్టం కాగలదు.

బలమైన ప్రజాస్వామ్యం హైదరాబాదులో స్థాపింపబడటానికి చౌధురి పునాది వేశాడనీ, ప్రజాప్రభుత్వం సంస్థానంలో ఇంకా లేదంటే దానిదోషమంతా హైదరాబాదీలదనీ, ప్రభుత్వ అధికారి ఒకరు అన్నారు.

40 ఏండ్ల వయస్సుగల జె. ఎన్. చౌధురి ఇండియా సైన్యంలో కల్లా యువకుడైన సేనాధిపతి ఆయన నిష్కల్మష మనస్కతయే ఆయనను ప్రజాభిమానం చూరగొనేట్లు చేసింది.

1938లో చౌధురి 7వ లైట్ కావల్రీకి అధిపతిగా నియమితులయ్యారు.

ప్రఖ్యాతిపొందిన 5 వ భారత సైనిక విభాగమునకు అధిపతిగా ఆయన సూడాన్, ఎరిట్రియా, అబిసీనియా, సహారా పశ్చిమ భాగాలలో గత యుద్ధ ప్రారంభంలో పనిచేశారు. 1943 లో క్వెట్టాలోని సైనికాధికారుల కళాశాలలో ఉపాధ్యాయుడుగా ఆయన ఇండియాకు తిరిగి వచ్చారు. మరుసటి సంవత్సరం ఆయన 16 వ లైట్ కావల్రీకి అధిపతి అయ్యారు. మొట్టమొదటగా యుద్ధంలోకి ఒక భారతీయునిచేత దూకించబడిన భారతీయసైన్యంయిదే. చౌధురి నాయకత్వాన యీ సైన్యం రంగూనుమీదకి పురోగమించింది. తరువాత మధ్య బర్మా యుద్ధంలో పాల్గొని, విజయం చేపట్టి, ప్రసిద్ధిపొందింది. 1945 జనవరిలో మలయా సైన్యమునకు బ్రిగేడియర్‌గా నియమింపబడటంతో ఆయన మన సైన్యంలోని మొదటి భారతీయ బ్రిగేడియర్ అయ్యారు. ఆమరుసటి ఏడు ఆయన భారత సైనిక ప్రధాన కార్యాలయంలో యుద్ధనిర్వహణ డైరెక్టరుగా నియమితులయ్యారు. గత సంవత్సరం చౌధురి మేజర్ జనరల్ హోదాకు వచ్చి ప్రధాన సైనికాధికారి అయ్యారు.

వీరు కలకత్తాలో ఒక పేరుపొందిన బారిస్టరుగారి ప్రథమ పుత్రుడు. సైనికంగా గొప్ప ఖ్యాతిగడించి కీర్తి గడించటమే కాకుండా సమర్థుడైన పరిపాలకుడుగాను, రాజ్యాంగవేత్తగానుకూడా కీర్తి గడించారు. స్వ. వి.

# ప. గో. జిల్లాకు ప్రభుత్వం నుండి 40 వేల రూ॥ల తాత్కాలిక సహాయం

## జిల్లాలో 4 కోట్ల రూ॥ కిమ్మతుగల ధాన్య నష్టం

ఏలూరు, నవంబరు 20: పశ్చిమ గోదావరి జిల్లాలో వరద ప్రాంతములకు సహాయము చేసే ఏర్పాట్లు చురుకుగా జరుగుతున్నవి. తాత్కాలిక సహాయంగా మద్రాసు ప్రభుత్వంవారు 40వేల రూ॥ మంజూరుచేశారు. ఇదిగాక జిల్లా అధికారులు బాధితులకు ఉచితంగా తాటి ఆకులు గృహనిర్మాణ పరికరాలు యిస్తున్నారు.

తుపాను వరదలకు 20 రోజుల అనంతరం కూడా జిల్లాలోపలు చోట్ల మోకాటిలోతు నీరు నిలిచి వున్నందున పహారాపు ఏర్పాట్లు కొంచెం ఆలస్యము, కష్టము అవుతున్నవి.

దక్షిణ భారతమునకు 'గాదె' వంటి పశ్చిమ గోదావరి జిల్లాలో ఆహార పైర్లకు కలిగిన నష్టం అపారం. నష్టపడ్డ ఎకరాలు లక్షల వరి భూములలోను 31 వేల ఎకరాలు దాదాపు 15 రోజులపాటు నీళ్లలో మునిగివున్నందున పూర్తిగా దెబ్బతిన్నాయి.

లక్ష 60 వేల ఎకరాల రెంటపంట భూముల్లో 60 వేల ఎకరాలదాకా పూర్తిగా చెడిపోయినై. ఈ జిల్లా మామూలుగా 2,30,000 టన్నుల ధాన్యం పండిస్తున్నది. 1,85,000 టన్నులు ఎగుమతి చేస్తున్నది. ఈ ఏడాదిసేకరణ 1,20,000 టన్నులకు మించదని అంచనా. అంటే దాదాపు 3 కోట్ల 90 వేల రూ॥ నష్టమని తేలుతున్నది.

మొత్తం తుపాను దెబ్బకు మృతులైన వారిసంఖ్య 59 అనీ, ఇందులో 27 గురు ఉప్పెన కెరటాల్లో కొట్టుకుపోయినవారనీ కలెక్టరు షేక్ అహ్మద్ పి. టి. ఐ. విలేఖరికి తెలియచేశారు. పి. టి. ఐ.

## ఆంధ్రులకు యు. పి. నుండి సహాయం

### ఆలోచిస్తానని గవర్నరుగారి సమాధానం

విజయవాడ, నవంబరు 19: యు. పి. రాష్ట్ర గవర్నరు సరోజినీ నాయుడు ఆంధ్రకాంగ్రెసు అధ్యక్షుడు ఎన్. జి. రంగాగారికి టెలిగ్రాం సందేశం పంపిస్తూ, ఆంధ్రదేశంలో తుపానువల్ల నష్టపడిన ప్రజలకు సహాయంచేసే విషయమును, తాను యు. పి. ప్రధానితో చర్చించిన మీదట, తప్పక ఆలోచిస్తానని తెలియచేశారు.

ఆంధ్రకోస్తా జిల్లాలలో తుపాను, వరదల కారణంగా జరిగిన బీభత్సాన్ని గూర్చి రంగాగారు వ్రాసిన లేఖకు సమాధానంగా యు. పి. గవర్నరు ఈ సందేశం పంపారు.

# హైదరాబాద్ సంస్థాన కర్ణాటక కాంగ్రెస్ వ్యవహారాలు

## శ్రీనివాసరావు అఖిలేఖర్ వివరణ

హైదరాబాద్, నవంబరు 19: సంస్థాన కర్ణాటక రాష్ట్ర కాంగ్రెస్ సంఘంలో స్వామిజీ పక్షానికి చెందిన 84 గురు సభ్యులచే సంఘ అధ్యక్షుడుగా యిటీవల ఎన్నుకోబడిన శ్రీనివాసరావు అఖిలేకార్ నేడు పత్రికా ప్రతినిధుల సమావేశంలో ప్రసంగిస్తూ జనార్దనరావు దేశాయ్‌పై విశ్వాసరాహిత్య తీర్మానం ఎందుకుపెట్టవలసి వచ్చిందో వివరించారు. బీదర్ జిల్లా సభ్యులు 15 మంది కర్ణాటక రాష్ట్ర కాంగ్రెస్ సంఘ అత్యవసర సమావేశాన్ని ఏర్పాటు చెయ్యవలసిందని సెప్టెంబరు 15న సంఘ ప్రధాన కార్యదర్శికి విజ్ఞప్తి పంపారు. అదరోజున గుల్బర్గా జిల్లా సభ్యులు 20 మంది, జనార్దనరావు దేశాయ్‌పై విశ్వాసరాహిత్య తీర్మానం పెట్టుటకు సంఘ అత్యవసర సమావేశం ఏర్పాటు చేయవలసిందని కార్యదర్శికి విజ్ఞప్తి పంపారు. తిరిగి అక్టోబరు 10న బీదర్ జిల్లా సభ్యులు కొందరు, సంఘ సమావేశాన్ని ఏర్పాటు చెయ్యవలసిందని నిన్న పంపారు. కాని ప్రధాన కార్యదర్శి పోటీ పక్షానికి చెందినవాడవటంచేత, అసలు సమావేశాన్ని ఏర్పాటుచేయలేదని శ్రీనివాసరావు అఖిలేకార్ అన్నారు. ఈ పరిస్థితులు కారణంగాను, సంఘ అధ్యక్షుడైన జనార్దనరావు దేశాయ్ కేంద్ర వ్యతిరేక, విధ్వంసక విధానం అవలంబిస్తుండటంచేతను, తాము పునఃసరిగా సమావేశాన్ని ఏర్పాటు చేయవలసి వచ్చిందన్నారు.

నవంబరు 15 న జరిగిన సమావేశపు నోటీసు రిజిష్టరు పోస్టులో సంస్థాన కర్ణాటక రాష్ట్రకాంగ్రెస్ సంఘంలోని 60 మంది సభ్యులకూ పంపబడిందన్నారు. సమావేశానికి 84 గురు హాజరయ్యారని చెప్పి, శ్రీనివాసరావు పత్రికా ప్రతినిధులకు మినిట్సు పుస్తకంలో సమావేశానికి హాజరైన 84 గురి సంతకాలు చూపించారు. ఈ విషయంలో కర్ణాటక రాష్ట్ర కాంగ్రెస్ సంఘాన్ని యింకొకసారి సమావేశపరచి, తిరిగి వారి నిర్ణయాన్ని తీసుకొంటానికి సిద్ధంగా ఉన్నానని శ్రీనివాసరావు అన్నారు.

ఈ పరిస్థితులలో, సమావేశాన్ని ఏర్పాటుచేసి విశ్వాసరాహిత్య తీర్మానం చెయ్యటం ఒక్కటే ప్రజాసత్తాకపద్ధతి అన్నారు. రాష్ట్రకాంగ్రెసు సంఘాన్ని సమావేశపరచటానికి 20 మంది సభ్యులు కోరితే చాలునన్నారు.

సంస్థాన కర్ణాటకరాష్ట్ర కాంగ్రెసు సంఘ మాజీ కార్యదర్శి, యీ పరిస్థితిని గురించి చర్చించుటకుగాను నవంబరు 28 న కర్ణాటక ప్రదేశ కాంగ్రెసు డెలిగేట్ల సమావేశాన్ని జరుపుటకు నిశ్చయించెను. ఈ సమావేశం అక్రమమైనది కావాలని అంటూ, డెలిగేట్లను అఖిల హైదరాబాద్ కాంగ్రెసు సంఘానికి తమ ప్రతినిధులుగా ఎన్నుకోవటం మినహాగా కార్యనిర్వహణాధికారాలేమీ ఉండవని శ్రీనివాసరావు అన్నారు. డెలిగేట్ల సమావేశం కర్ణాటక రాష్ట్ర కాంగ్రెసు సంఘ అధికారాలను అపహరించలేదన్నారు.

